


డా.డి.వి.యస్.రాజు డా.యమ్.ప్రభాకరరెడ్డి

JAGATI Rs. 2-00 January 1990

35th Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

జనవరి - 1990

## సాహితీ సుధ

వనజ భవుండు కోపమున వాహనమైన మరాళభర్తకున్
వనజవనీ విహార కలనంబు దొలంగగ జేయు గాని గుం
భనమున దుగ్ధజీవన విభాగ విధాన నిరూఢ నైపుణీ
జనిత మహా యశోవిభవ సారము హంసకు మాన్పజాలునే !

—భర్తృహరి



పరదళంబుల గాంచి భయముచే నురికిన - రాజు గాడతడు గోరాజు గాని
ధర్మంబులకు విఘాతము సేయ మంత్రిశే - ఖరుడు గాడతడు సంకరుడు గాని
విద్యాప్రసంగము ల్విను రసజ్ఞులు లేక - ప్రాజ్ఞులసభ గాదు రచ్చ గాని
పతితోడ గలహించి పడుకొని యేడ్చెడి - దాలు గాదది యెద్దుతేలు గాని
శాస్త్రముల మించినట్టి యాచార మైన - నిష్ఠ గానేర దది పెను జ్యేష్ఠ గాని
మదదిపు విశాల మునిజన హృదయలోల - వేణుగోపాల భక్త సంత్రాణశీల

—వేణుగోపాలశతకం

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి. బా. 2922, మద్రాసు - 600 004
ఫోన్: 76697- చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00, జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.-100-00

ముఖచిత్రం: నారాయణ రెడ్డి

# నిమ్మతొనలు

మొదటి ఇంగ్లీషు డిక్షనరీ (నిఘంటువు) కూర్చినది డాక్టర్ సామ్యుల్ జాన్సన్. యాడమ్స్ అనే మిత్రుడు ఆయనని అడిగాడు; "ఏమండీ, మూడేళ్లలో ఈ బృహత్కార్యం నెరవేర్చగలరా? ఫ్రెంచి భాషా నిఘంటువు తయారయేందుకు నలభైమంది పండితులు, నలభై సంవత్సరాలు తీసుకున్నారని ఫ్రెంచి అకాడమీ వారు చెబుతున్నారే - అటువంటిది మీరు, ఒక్క చేతిమీద, మూడేళ్లలో ముగించగలరంటే ఎలా సాధ్యమవుతుందండీ?"

"సార్, నలభై నలభై ఎంత - పదహారువందలు. ఆ పదహారు వందలని మూడు పెట్టి భజించండి. ఇప్పుడు తెలుస్తోంది కదా అంగ్లేయులూ ఫ్రెంచివారూ ఏ నిష్పత్తిలో పనిచేసేదీను" - అన్నాడు జాన్సన్.

జాన్సన్‌కి స్కాచ్‌వారంటే (స్కాట్లండు ప్రజలు) సదభిప్రాయం లేదు. వారి మీద జోకులు విసరడం ఆయన సరదాల్లో ఒకటి. జాన్సన్ జీవితగాధని లోకానికి వెల్లడి చేసిన బాస్వెల్‌ని మొదటిసారి పరిచయం చేస్తున్నప్పుడు మిత్రుడు డేవిస్ అన్నాడు: "ఈయన స్కాట్లండు నుంచి వస్తున్నారు"

"అలాగనా? ప్రతిభావంతులందరూ అక్కడనుంచి బయటికి వచ్చేయవల్సిందేగదా" - అన్నాడు జాన్సన్ బాస్వెల్‌ని ఉద్దేశిస్తూ.

ఒకసారి బాస్వెల్, తన జన్మభూమి స్కాట్లండుని, సమర్థిస్తూ చెప్పాడు: "అక్కడ పుష్కలంగా ఆహార పదార్థాలు దొరుకుతాయి - పుష్టినిచ్చే మాంసమూ, ఉత్సాహమిచ్చే ద్రాక్ష రసమూ కావలిసినంత!"

"అవును, అవి కావాలికదా పారిపోయేందుకు" - అని జాన్సన్ చురక.

వాదనలో వోడి పోవడమనేది ఆయన భరించలేక పోయేవాడు. సహేతుకమైన తర్కం కొరవడితే, ఆ వాద ప్రతివాదాలను హాస్యధోరణిలో చమత్కారాల పుంతలోకి పట్టించేవాడు. హేతుబద్ధం గాకపోయినా ఛలోక్తిగా మాట విసిరినప్పుడు నవ్వక తప్పదు. ఆ విద్యలో ఆయన అఖండుడు.

సమకాలీనుడైన ఆలివర్ గోల్డ్‌స్మిత్ అంటాడు: "గురి చూసి తుపాకీతో కాలుద్దామనుకుంటాడు జాన్సన్.

ఒకవేళ గురి తప్పిందా, తుపా మడమతో కొట్టబోతాడు''

ఆ రోజుల్లో 'మెడికేటెజ్ బాత్' (స్నానవైద్యం) మీద ప్రజల కెంతో విశ్వాసం ఉండేది - ఈనాడూ వుందనుకోండి స్నానాల తొట్టెలో వెచ్చటి నీరు పోసి, కొన్ని లవణాలు కలిపి, ఆ వుడుకు నీటిలో కొంత సేపు కూచుని, తొట్టె స్నానం చేస్తే వ్యాధులు నయమవుతాయనీ, రోగి ఆరోగ్య వంతుడవుతాడనీ గాఢంగా నమ్మేవారు. ఈ తొట్టె స్నానాలు, వీటి వైద్య ప్రభావం మీద జాన్సన్‌కి నమ్మకం లేదు.

"వేడి నీరు చర్మ గ్రంథులని ఉత్తేజపరిచి, లోనికి స్వీకరించే రసాయినక వాయువుల ద్వారా, రక్త ప్రసారంలో ఏర్పడే మార్పు, వ్యాధి నిరోధక హేతువవుతుంది" - అని ఒక పెద్ద మనిషి చాలా నిదానంగా వివరించాడు.

ప్రతివాదం దొరకని జాన్సన్ అన్నాడు: "ఆ రసాయినక వాయువులు శరీరంలోకిగాక బుర్రలోకి ప్రవేశిస్తే బావుంటుందేమో ?''

షేక్స్‌పియర్ నాటకాలలో నాయిక పాత్ర ధరించే ఒక నటీమణి, జాన్సన్‌ని చూడటానికి వచ్చింది. ఆయన రూమ్‌లో ఒక కుర్చీ కూడా ఖాళీగా లేకపోవడం వల్ల ఆమె కాసేపు నిలబడివుండక తప్పలేదు.

జాన్సన్ ఆమె ముఖంలోకి చిరునవ్వుతో చూస్తూ: "మీరు ఎందరెందరినో నిలబెట్టారు - మిమ్మల్ని నిలబెట్టే అదృష్టం నాదయింది''

జాన్సన్ - బాస్వెల్ ద్వయం ఆంగ్ల సాహిత్య చరిత్రలో అజరామరం. ఆలివర్ గోల్డ్‌స్మిత్‌ని జాన్సన్ ఎప్పటికప్పుడు ఆటలు పటించేవాడు. తన పలుకులతో నవ్వించేవ్యక్తి కల్మష రహితుడై వుంటాడు - అని, మెచ్చుకుంటాడు ఎడ్మండ్‌బర్క్ డాక్టర్ జాన్సన్‌ని.

—క్షీరసాగరమ్

## పాఠకులేఖలు

చందూర్‌గారికి : ఆచార్యరాధా కృష్ణ జయంతి సెమినారు చర్చలలోని ఒకొక్క ఉపన్యాస సారాంశాన్ని కొద్ది మాటలలో, ప్రతివక్త వివరించదలిచిన సూటిభావాన్ని, (నవంబరు సంచిక) చదువరులకు, జిజ్ఞాసాపరులకు సరాసరి అవగాహన కలిగించే విధంగా చేసిన మీ 'డైరీ' విజ్ఞానదాయకంగా ప్రభోదాత్మకంగా వున్నది - అభినంద నీయము .... కేసరిగారి జీవితగాధ లోని 'కోటప్పకొండ తిరునాళ్ళ' మాచిన్నతనంలో వెళ్లి చూచినదాని కన్నా, వారు పూసగుచ్చినట్టు ఎంతో యథార్ధ చిత్రాన్ని చిత్రించడంలో భాష, భావం, దృశ్యం హృద్యంగావుండి, పాతస్మృతులు కళ్లముందున్నట్లున్నవి.

—వావిలాల గోపాలకృష్ణయ్య
గుంటూరు-2

చందూర్ దంపతులకు : పోయిన నెలలో మిమ్మల్ని (మద్రాసులో) కలుసుకు వచ్చిన దగ్గర్నుంచి, మీకు ఉత్తరం రాద్దామనుకుంటూనే, యిప్పటికి రాస్తున్నాను .... ఓల్గా అనువదించిన 'పుట్టిన బిడ్డకు తల్లి వుత్తరం' బుక్‌పోస్ట్‌లో పంపుతున్నాను - శాంతా రామేశ్వర్ ఆవిష్కరించారు .... మీరు ఆ మధ్య వేసిన 'జగతి' ముఖచిత్రం (కన్నీరు కార్చే వృక్షరాజం) అద్భుతంగా ఉంది! మీ దంపతుల రచనలు చదవడమేగాని చూడడం, వినడం యిన్నాళ్లకు సాధ్యపడింది. చదివిన దానికి ఏమాత్రం తీసిపోనట్టున్న మీ యిరువురినీ చూసి సంతోషపడ్డాను.

—ఎ కుటుంబరావు
హైదరాబాదు-34

చందూర్‌గారికి : నమస్కారములు. 'జగతి' చూడగానే ఎంతబావుందో, చదివిన మీదట ఆ ఆనందం రెట్టింపు అయింది. ఎంతో దగ్గరవాళ్లు ఆత్మీయంగా పలకరిస్తున్న అనుభూతి కలిగింది. 'టూర్స్' వ్రాస్తున్నప్పుడు, మేముకూడా ఆ ప్రయాణంలో వున్న భావన కలుగుతుంది.

—యస్ రమణి
విశాఖ-17

ఎడిటర్‌గారికి : నమస్కారములు. 1989 జులై సంచికనుంచి మీరు వేస్తున్న కేసరిగారి 'చిన్ననాటిముచ్చట్లు' మా యింట్లోనేకాదు, మావీధిలో అందరము కడుశ్రద్ధగా చదువుతున్నాము. అట్లాగే ఇంగ్లీషులోని ''రామాయణప్రశ్నలు- సమాధానాలు''

—కె బలరామిరెడ్డి
అనుమసముద్రం

# వెన్నెల కెరటాలు

## దరువూరి వీరయ్య

కాటన్ మహాశయుని ఆనాటి పరిశీలనల నుండి పిల్లకాలువల ద్వారా కృష్ణ నీరు పంటపొలాలకు రాకవరకు నడచిన పూర్తిగాథను ఈ "నాగార్జున సాగర్ సర్వస్వం" లో చూడవచ్చు. ఈ కథను వెలుగునకు తెచ్చి గుర్తు చేయటమేగాక ముందు తరాలవారికి వినియోగపడగల సమాచార సంపుటముగా తయారుచేసినారు దరువూరి వీరయ్యగారు. నందికొండ ప్రత్యేకతను చక్కగా చిత్రీకరించిన ప్రశంసనీయులు. తెలిసినంతలో ఒక నదీ ప్రాజెక్టు గాథను వివరిస్తూ వీరయ్యగారు ప్రచురించిన "నాగార్జున సాగర్ సర్వస్వము" ప్రప్రథమము అని చెప్పవచ్చు. కాలువనీరు నోచుకోని, వర్షాల పై ఆధారపడి, ప్రకృతి వైపర్యములకు తల్లక్రిందులగు మెట్టరైతుకుటుంబము నుండి వచ్చిన వీరయ్యగారి మనస్సు నాగార్జున సాగర్ నీటి రాకతో ఎంత ఉప్పొంగి పోయినదో ఈ సర్వస్వము లో చూడవచ్చును. వీరయ్యగారివలె ప్రతి మెట్టరైతు ఆనందంలో విందులు వేస్తాడు. పొలాలకే గాకుండా, పశువులకు ప్రజలకు అందరికీ నీటిబాధ

—రామ్‌మోహన్‌రాయ్
'ప్రత్యేక సంచిక'లో

## మలేసియా

తెలుగు సంతతి వారయిన శాతవాహనులు బౌద్ధమత ప్రచారానికీ, వర్తకవ్యాపారానికీ ప్రపంచమంతా ప్రయాణం చేశారు. వారు మలేసియా గూడ వెళ్ళి బౌద్ధమతాన్ని ప్రచారము చేయుటతో వర్తక వ్యాపారాలు జయప్రదంగా సాగించారు. మలేసియా తెరచాపల ఓడలతో వెళ్ళిన ఈ తెలుగు వర్తకులు తిరుగు ప్రయాణాలకు అనుకూలమయిన గాలులు ఉన్నప్పుడు ఆంధ్రకు తిరిగివచ్చేవారు. ఇటువంటి గాలులకై ఒక్కొక్కప్పుడు 6 నెలలు మలేసియాలో ఉండవలసి వచ్చేదిది. అంతకాలం అచ్చటనే ఉండిపోయిన ఈ తెలుగు వర్తకులు అచ్చటి ప్రజలలో (మలాయివారితో) సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకొని, అచ్చటి స్త్రీలను వివాహాలు గూడ చేసుకొన్నారు.

—ఎమ్ సోమనాయుడు
'గాంధీక్షేత్రం'లో

# పాతికేళ్ళ నాటి పిక్చర్

## చిన్నీ బ్రదర్స్
## 'సక్కుబాయి'

కవిత కనర్హం కాదేదీ అన్నట్లే, వెండితెరకు ఎటువంటి కథ అయినా పనికొస్తుంది. అయితే, అది చూసి హర్షించేవారు, 20 వ శతాబ్ది ఆరవ దశకంలోని ప్రేక్షకులనే ధ్యాస నిర్మాతలకు వుంటే చాలు! నామ సంకీర్తనతో భగవంతుని వద్దకు వెళ్లడమనేది భక్తి జీవన క్రమంలో ఒక అధ్యాయం. మీ రా బా యి, సక్కుబాయి తమ మధుర భక్తితో విశ్వవిభుని ఆరాధించినవారు .... సక్కుబాయి కథ ఆంధ్రాలో భజన మందిరాల ద్వారా వ్యాప్తిలోకి వచ్చింది. పాండురంగ విఠల్‌ని సేవించడానికి వెళ్లిన భజన కూటాలు, సక్కుబాయి చరితాన్ని పట్టుకొచ్చాయి - ఆ పేరుగల నాటకంతో ఆమె మరింత పూజనీయురాలయింది.... తల్లి మాటకు ఎదురు చెప్పలేని కొడుకు, రాచి రంపాన పెట్టే అత్తగారు, సంసార బాధలు భరించలేక కృష్ణ పరమాత్మను నమ్ముకున్న కోడలు - ఈ మూడు ప్రధాన పాత్రల నాటకం, నాటకాలకు ఆదరణ వున్న రోజులలో ప్రజను బాగా ఆకట్టుకుంది. అత్తగారు పెట్టే కష్టాలకు పరమౌషధం కృష్ణభక్తి - ఈ కృష్ణభక్తి ఒక మాయాజాలంగా సక్కుబాయిని ఆదుకోవడం భక్తి నాటకాల రోజులలో ఫరవాలేదుగాని ఈనాటి సినీ ప్రేక్షకులు ఆమోదిస్తారా?.... కృష్ణుడు సక్కుబాయిగా మారి, భర్తశయన మందిరం నుంచి బయటకు వచ్చి, చాపా చెంబుతో కూచోవడం; కోడలు మంత్ర విద్యాప్రభావం నాలుగు మూడు సార్లు రుచిమూసి కూడా కాలూ చెయ్యీ పడిపోయేదాకా అత్తగారికి ఇంగిత జ్ఞానం కలగకపోవడం, రుక్మిణి (లక్ష్మీదేవే కావచ్చు) పరమశివుని ప్రార్థించి బూడిద అయిన సక్కుబాయిని మళ్లీ మనిషిని చేయమనడం, ఆయన చేయడం (కనీసం శవదహనమైనా ఆపి వుండవచ్చు) - యిటువంటివి అనేకం దేవుణ్ణి ఒక గారడీవానిగా మార్చి వేస్తున్నాయి .... అం జ లీ దే వి సక్కుబాయి పాత్రలో లీనమై, ఆ భూమికనెంతో స మ ర్థ వం త గా పోషించింది. మిగతా అందరూ తమ తమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. ఆదినారాయణరావు సమకూర్చిన సంగీత బాణీలూ, ఆ పాటలూ చెవుల మీద చిరకాలం నిలిచిపోతాయి. కథా సంవిధానంకంటె సంగీతమే ఈ చిత్రానికి ఊపిరి.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జ గ తి' - అక్టోబరు 1965

## మానవ ప్రగతి

### 'హైపర్ సోనిక్'

శబ్దం కంటె 25 రెట్లు ఎక్కువ వేగంతో ప్రయాణించే 'హైపర్ సోనిక్' విమానం తుదకు స్పేస్ షటిల్ స్థానాన్ని ఆక్రమించవచ్చునని అమెరికన్ నిపుణులు భావిస్తున్నారు. ఈ 'హైపర్ సోనిక్' విమానం 'మొదటి నమూనా' 1990 దశకం మధ్యభాగంలో ప్రయోగాత్మకంగా ఎగిరే అవకాశాలున్నాయని, ఈ విమానం నమూనాపై ఇప్పటికే మూడున్నర సంవత్సరాల పరిశోధన జరిగిందని అమెరికన్ ఎయిరో స్పేస్ అధికారులు తెలియజేస్తున్నారు. 'నేషనల్ ఎయిరో స్పేస్ ప్లేన్'గా వ్యవహరిస్తున్న ఈ 'హైపర్ సోనిక్' విమానం అమెరికన్ పారిశ్రామిక రంగం, విశ్వవిద్యాలయాలు, రక్షణ విభాగం, 'నాసా'ల ఉమ్మడి కృషితో రూపొందుతున్నది. ఈ 'హైపర్ సోనిక్' విమానం నమూనాలలో ఒకటి మామూలు విమానాశ్రయం 'రన్‌వే' నుంచి పైకిలేచి, శబ్దంకంటె 25 రెట్లు ఎక్కువ వేగంతో ప్రయాణించి (గంటకు 28,800 కిలోమీటర్లు), ఆ తర్వాత తనను తానే అంతరిక్షంలో భూకక్ష్యంలోకి ప్రవేశపెట్టుకుంటుంది. రెండవ రకం ఎయిరో స్పేస్ విమానం గంటకు సుమారు 14,000 కిలోమీటర్ల వేగంతో ప్రయాణించి లాస్ ఏంజిలిస్ నుంచి టోక్యోకి ప్రయాణికులను కేవలం రెండు గంటల వ్యవధిలో చేరవేస్తుంది. ఈ ఎయిరో స్పేస్ విమానం భూమి మీద నుంచి, రోదసిలోను జరిపే రవాణాపద్ధతులను సమూలంగా మార్చివేస్తుందని భావిస్తున్నారు. గాలిని పీల్చుకునే ఇంజను కలిగి వుండడం ఈ ఎయిరో స్పేస్ విమానం ప్రత్యేకత. ఈ విమానం తన ఇంజను పని చేసేందుకు అవసరమైన ద్రవీకృత ఉదజనిని భూమి వాతావరణం లోంచి 'పీల్చుకునే' ఆక్సిజన్‌తో మండిస్తుంది. 'స్పేస్‌షటిల్' లాంటి ఇతర వ్యోమ శకటాలు తమ బరువుకు రెండు రెట్లు ఎక్కువ బరువుండే ద్రవీకృత ఆక్సిజన్‌ని తమ వెంట తీసుకువెళతాయి. ఎయిరో స్పేస్ విమానం ఆక్సిజన్‌ని వాతావరణం నుంచి పీల్చుకునే ఇంజన్‌ని కలిగి వుండడంవల్ల ఇందులో

ఉపగ్రహాలు, ఇతర భారీ పరికరాలను కక్ష్యలోకి పంపడానికి ఖర్చు బాలా తగ్గుతుందని కూడా అంటున్నారు. ఈ కార్యక్రమంలో ఇప్పుడు 5,000 మంది పని చేస్తున్నారు.

## 'చిప్స్'

తిరుపతి సమీపంలోని ఒక 'సిలికాన్ చిప్' తయారీ సంస్థకు తన 'చిప్స్' ని స్వీడన్‌కి ఎగుమతి చేసేందుకై 'ఆర్డర్' లభించింది. జి. ఎం. ఎల్. చిప్ కాంపోనెంట్స్ అనే ఈ తిరుపతి ప్రాంత సంస్థను న్యూజెర్సీ లోని ప్రిన్స్‌టన్‌లో నివసిస్తున్న శకుంతలా గ్యానమాగ్రి అనే మహిళ (అమెరికాలో వుంటూ) నిర్వహిస్తున్నారు. ఈ సంస్థ వాణిజ్యసరళిలో 'చిప్స్' ఉత్పత్తిని ప్రారంభించింది. ఆంధ్రప్రదేశ్‌లోని తిరుపతికి సమీపంలో కరకంబాడి వద్దగల ఈ ఫ్యాక్టరీలో పెక్కు పొరలు గల సిరామిక్ చిప్ కెపాసిటర్లు తయారవుతున్నాయి. ఈ సంస్థకు 'నోవోకాప్' అనే అమెరికన్ సంస్థ సాంకేతిక సహకారం అందిస్తున్నది. ఇప్పుడు 'జి. ఎం. ఎల్.'లో టెలివిజన్ ట్యూనర్లలోను, హైబ్రిడ్‌లలోను, టెలికమ్యూనికేషన్లలోను వినియోగించే 'కెపాసిటర్లు' తయారవుతున్నాయి. శకుంతల అమెరికా నుంచి నిర్వహించే ఈ 53 లక్షల 50 వేల డాలర్ల పథకం నాన్ 'రెసిడెంట్ ఇండియన్ల కోసం భారత ప్రభుత్వ ఆధ్వర్యంలో గల ఒక పథకం క్రింద వర్గీకరణ పొందింది.

# కొత్త పుస్తకాలు

బయో సింఫనీ (Biosymphony) - ఇంగ్లీషులో. రచయిత : సంజీవదేవ్. ప్రచురణ : కాంతి కుంజ ప్రచురణలు, తెనాలి - 522 201 - వెల : రు. 40-00.

అనుభవాలను అనుభూతులుగా మలచుకోవడంలోనే సాఫల్యం. సము పార్జిత జ్ఞానాన్ని తార్కికమైన ఆలో చనల రూపంలో వెలువరించగలగడం లోనే సార్థక్యం. ఇవి సాధించగలిగిన కవీ, చిత్రకారుడి రచనే '(Biosymphony)' 'జీవరాగ సమ్మేళనం.'

ఆలోచించడం ఒక కళ, శాస్త్రం కాదు - అంటాడు లిన్ యుటాంగ్. మరి ఫిలాసఫీని శాస్త్రం అంటున్నారు కాబట్టి సంజీవ దేవ్‌ని 'లిరికల్ ఫిలాస ఫర్' అనాలి.

ఆలోచించగలిగిన ప్రతి వ్యక్తిలో ఏదో ఒక సమయంలో యీ ప్రశ్న వుదయించక మానదు. జీవితం ఏమిటి? లేక, నేను అర్థవంతంగా జీవితం గడుపుతున్నానా? ఉపని షత్తుల కాలం నుండీ మనిషి మస్తి ష్కాన్ని యీ ప్రశ్న వేధిస్తూనే వున్నది. శతాబ్దాలుగా తాత్త్వికులు, మేధావులు, రచయితలు, కవులు తరచితరచి చూశారు. సాధ్యమయినంత నిర్దిష్టంగా, నిశితంగా జీవన సాఫ ల్యాన్ని నిర్వచించాలని చూశారు. విభిన్న అనుభవాల ఆస్వాదనే పరమావధి అన్నవారూ వున్నారు. భావస్వేచ్ఛ, ఆనందాన్వేషణ అన్న వారూ, మనసు - హృదయము, ఆలో చనలు - భావాలు, తర్కము - విశ్వా సము, వుద్వేగము - ప్రేమ, లలిత కళలు - ఆనందము, వీటన్నింటినీ విశ్లేషిస్తూ, వివేచిస్తూ సుగమమూ, సుమనోహరమూ, సౌగంధ భరితమూ అయిన జీవన పథాన్ని మానవాళికి నిర్దేశించే ప్రయత్నం చేసినవారూ వున్నారు.

నాచు నుండి దేవదారు వరకూ గల వృక్ష జాతీ, సమస్త జంతుకోటీ, ఆకాశమూ, నక్షత్రాలు, ఋతువులూ మొదలయిన ప్రకృతితో మనిషి జీవితం సమ్మేళనం పొంది ఆలపించేదే జీవ రాగం. ఆ సమరస రాగంలోని నిమ్నోన్నతాలు చింతనా పరులలో తాత్త్విక అన్వేషణను రేకెత్తించాయి.

ప్రత్యక్షంగా కనిపించేదే సత్యం, విచారం లేకుండా క్షణక్షణమూ గడ పడమే ఆనందం, ధన కనక వస్తు వాహన సంపాదన జీవిత ధ్యేయం - మొదలయినవి ఆధునిక ఆలోచనా

ధ-ంణులు. ఆధునిక యుగపు మరొక ప్రత్యేక లక్షణం కీర్తి కాంక్ష. మోక్ష సాధనకి ఋషులు తలక్రిందులుగా తపస్సు చేసేవారట. కీర్తికాంక్ష మనిషి సమస్తవిలువలను తలక్రిందులు చేయగల సామర్థ్యం కలది. 12, 13 పుటల్లో రచయిత కీర్తిలాలస గురించి చేసిన విశ్లేషణ గమనింపదగినది. అమెరికన్ కవయిత్రి ఎమిలీ డికిన్‌సన్ భావాలు గుర్తుకు వస్తాయి.

భాషాభేదాలు, మతము, విశ్వాసాలు, సంస్కృతి, సంప్రదాయం, జాతీయ భావాలు - యివన్నీ మానవ హృదయాలను పంజరాల వంటి యిరుకుగదుల్లో బంధించి వేస్తాయి. ఏకత్వం, సహోదరత్వం, సుహృద్భావం, అన్యోన్యత్వం వంటి అందమైన శబ్దాలు సుందరతరమైన వున్నతమయిన మానవతా విలువలను ప్రబోధించి విశ్వమానవ తత్వం వైపు ప్రపంచాన్ని నడిపిస్తాయి. మెటీరియలిజమా, స్పిరిచ్యుయలిజమా అని కాదు ప్రశ్న. హ్యూమనిజం ప్రపంచం అంతటా నెలకొల్పబడవలసిన నూతన మతం అంటారు రచయిత.

తర్కబద్ధమైన రచయిత ఆలోచనా రీతులు పాఠకుడిలో వుత్తేజాన్ని, క్రొత్త ఆలోచనలనూ కలుగజేస్తాయి.

ఈ విశ్వం ఆవిర్భవించక మునుపు 'జీవం' అనేది లేదనుకోవడం సరికాదు. 'ప్రాణం' అనేది వున్నది కాబట్టే విశ్వం రూపం దాల్చింది. భూమి మీద జీవచైతన్యం విభిన్న రూపాలలో, రీతులలో పరిణామం చెందుతూ వచ్చింది. జంతు, వృక్షరూపాలు, భౌతికమూ ఆధి భౌతికమూ, ఆలోచనాత్మకమూ, యింట్యూషను మొదలైనవి జీవచైతన్యపు భిన్నరూపాలు. ఈ విధంగా విశ్వం గోచర అగోచర రూపాలలో వున్న జీవానికి స్థావరం యిస్తున్నది. కాలానుగుణంగా విశ్వం ఒకనాడు అంతర్ధానమవవచ్చు. ప్రాణికోటి అంతా నశించవచ్చు. అయితే 'జీవచైతన్యం' అంతరించినట్లుకాదు. మళ్లీ యింకో 'విశ్వం' ఆవిర్భవించవచ్చు. రూపాతీతమయిన జీవచైతన్యం శాశ్వత అస్తిత్వమనే అనశ్వర లక్షణం గలది.

మాటల్లో పొదగలేనివి అనుకునే నైరూప్య భావాలను సహితం నైపుణ్యంతో అర్థవంతమైన వాక్యాలలో యిమడ్చగలిగారు రచయిత.

"మాటలు లేక శబ్దాలు లేకుండా ఆలోచన సాగదు. అయితే ఆలోచన అంటే వుత్త మాటల సముదాయమే అనీ అనలేము. ఒకటొకటిగా యిటుకలన్నీ పేర్చి గృహనిర్మాణం జరుగుతుంది. ఇటుకలు తీసివేస్తే యిల్లే కూలిపోతుంది. అంతమాత్రాన యిల్లు అంటే యిటుకల సముదాయమే అని అనలేము కదా"

ఏ అంశం తీసుకున్నా లోతుగా హేతుపూర్వకంగా అన్వేషించి తీర్పు చేయడం సంజీవదేవ్ ప్రత్యేకత.

దృశ్యం, శ్రవణం, వాసన, స్పర్శ, రుచి - యివి మనిషిలో అనుభూతులను కలుగజేస్తాయి. దృశ్యం, శ్రవణం ఎక్కువకాలం గుర్తు వుంటాయి. చూచిన దృశ్యానికి, విన్న పాటకి ఒక

రూపం లేక 'శ రీ ర ం' వున్నాయి గాబట్టి! ఈ రెండింటిలో మళ్ళీ పాట కంటె దృశ్యం (చిత్రపటం వంటిది) ఎక్కువకాలం స్మృతిలో వుంటుంది. అంటే స్మరణ చే సు కు న్న ప్పు డు మనసులో ప్రత్యక్ష మవుతుంది Spatial Art కాబట్టి. గానానికి జ్ఞాప కాలలో కొంత పరిమితివుంది. రుచి, వాసన, స్పర్శల అనుభవాలు కేవలం అనుభూతులే తప్ప వాటికి 'శరీరం' లేదు. అందువల్ల త్వరగా విస్మృతిలో పడిపోతాయి. అయితే దృశ్యం చూసి, ధ్వనితో ప్రేరణ చెంది కళాకారుడు ఒక చిత్రమో, గానమో సృష్టించినట్లుగా తక్కిన మూడింటిలో సాధ్యం కాదు. వ్యక్తిలో అవి కలిగించేది తాత్కాలిక మైన అనుభూతులు. అయితే ఎంత తక్షణమయినవో అంత తీవ్రమయినవి కూడా! బాధించేవి కావచ్చు. సంతోష పరచేవి కావచ్చు - ఏమయినా వుద్రేకపూరిత మయినవి.

మెలి మెల్లిగా 'టీ' సేవిస్తూ ప్రకృతికీ మానవుడికీ గల బాంధ వ్యాన్ని తర్కిస్తూ చర్చించే చైనీస్ ఫిలాసఫర్లు, తేలికయిన విషయాలను గురించి అని తోపింపచేస్తూనే గంభీర జీవిత సత్యాలను పరితలచేత దర్శింప జేసే యింగ్లీషు ఎస్సేయిస్టులు గుర్తుకు వస్తారు - యీ పుస్తకం చదువు తుంటే!

భూమి మీద మనిషి జీవించేది కొంత కాలమే. ఏదో ఒకరోజు మరణం తప్పదు. ఒక జీవిత కాలంలోనే అసంఖ్యాకమయిన బాధలూ, వేదనా, శోకమూ, నిరాశ, నిస్పృహా, ఓటమీ - యింకా ఎన్నో! అయినా సరే,

జీవించి వుండటం అతి మధురమయినది ప్రతి ప్రాణికీ! ఈ భూమీ, పరిసరాలు అత్యంత ప్రీతి పాత్రమయినవి. మళ్ళీ మనిషి మనసు భూమిని వదిలి ఆకాశంలోకి పరుగులు తీస్తుంది. పై పైకి పోవాలనీ, గ్రహాంతరయానం చేయాలని, వున్నత లక్ష్యాలు అందుకోవాలని, యుత్తమత్వం సాధించాలనీ; మానవుడిని అభ్యుదయం వైపు తీసుకొని పోయేది మనసు తీసే ఆ పరుగులే; పరిసరాలను అధిగమించి వున్నత శిఖరాలు అందుకోవాలనే ఆ ఆశయమే!

భారతీయ సంస్కృతీ సంప్రదాయంలోనే కాదు, తూర్పు దేశాలన్నింటిలో తామర పూవుకి మహత్వ పూర్ణమయిన స్థానం వున్నది. ఈ విషయాన్ని నాలుగో అధ్యాయంలో విపులంగా ప్రస్తావించారు రచయిత. పరిసరాలను అధిగమించి పరిణతి సాధించవచ్చుననడానికి సంకేతంగా నిలపడుతుంది కమలం. పంకంలో జన్మించినా, తన అనన్య సౌందర్య సౌరభం కాంతులు పలుదిక్కులకు ప్రసరింపజేసి చూపరులకు మనోల్లాసాన్నీ, మనోవికాసాన్నీ కలుగజేస్తుంది పద్మం. తామర ఆకులు నీటిలో పెరిగినా, నీరు వాటిపై పడినా, తడి అనేది, ఎరుగకుండా నిస్సంగత్వము అనే సందేశాన్ని చాటుతూ వుంటాయి. ఇంకో ప్రక్కన తామర పత్రాలపై విలక్షణంగా నిలిచిన నీటి బిందువులు, కొలనులోని నీటిలక్షణం కలవయినా, మౌక్తిక కాంతిని ప్రసరిస్తూ ఒక వైశిష్ట్యాన్ని ఆపాదించుకుంటాయి.

వ్యక్తి క్రమంగా ఆలోచనలలో పరిణతిని సాధిస్తూ, అతీంద్రియమైన అన్వేషణల ద్వారా నిస్సంగత్వతనూ, రాగ పరిత్యాగాన్నీ సాధించటం వల్ల లౌకిక ప్రపంచాన్నుండి దూరమవుతాడనుకోవడం పొరబాటు. అతని అంతర్గతశక్తులకు మరింత పదును చేకూర్చుకొని సంపూర్ణ మానవస్థితి (సూపర్‌మేన్)ని చేరుకుని తద్వారా తోటిమానవులకు సుఖదుఃఖాల నిరంతర వలయంనుండి నిష్కృతి కలిగించడానికి కృషి చేయగలుగుతాడు. ఒక వ్యక్తిలోని వెలుగుకిరణం సమాజం అంతటిని చైతన్యదీప్తితం చేయవచ్చు. ఆవిధంగా భీతి, శోకం వంటి బాధలనుండి విమోచనమూ, ఆనంద ప్రాప్తీ కలుగవచ్చును అందరికీ, - అంటారు రచయిత.

మనోవైజ్ఞానికులు మనసు అట్టడుగు పొరలలోని సబ్‌కాన్షస్ స్వభావ లక్షణాలను పరిశోధిస్తున్నారు. కాని మనిషి మనసు ఎంత ఎత్తులకు ఎదిగి ఆలోచించగలదో తెలిపే సూపర్‌కాన్షస్ అన్వేషణ భవిష్యత్తులో జరిగిననాడు మానవజీవితం యింత కంటే వుత్కృష్టంగా వుండబోతున్నది.

రాకెట్ వేగంతో పురోగమిస్తున్న శాస్త్రవిజ్ఞానం సహాయంతో యీ స్వప్నం యదార్థం అవగలదని సంజీవదేవ్ గాఢ విశ్వాసం.

మేధస్సు, కళాత్మకత అనే రెండు భిన్నధృవాల వంటి సమ్మేళనంగల

మానవుడి విచిత్రజీవితం రచయిత తాత్త్వికదృక్పథం అనే ప్రిజమ్‌లో విశ్లేషింపబడి యింద్రధనుస్సు వంటి ఏడు అధ్యాయాలుగా రూపం దాల్చింది, యీ గ్రంథంలో.

రచన అంతా సునిశితమైన తర్కంతో ధీమాగా నడిచినా, యిటు వంటి వాక్యం ఒకటి, పూలతోటలో షికారు చేస్తుంటే అరికాలులో ముల్లులా గుచ్చుకుంటుంది.

"వృక్ష ప్రపంచంలోని ప్రాణులు జంతు ప్రపంచంపై ఏవిధంగానూ ఆధారపడకుండా జీవించగలవు. కాని జంతుకోటి మాత్రం వృక్షాల ఆధారం లేకుండా బ్రతకలేవు." - కొన్ని వృక్ష జాతులు 'స్వపరాగ సంపర్కం తోనే సంతానోత్పత్తి జరుపుకున్నా కొన్ని జాతులు పూర్తిగా కీటకాలపై పరపరాగ సంపర్కానికి ఆధార పడతాయి.

ఫిలాసఫీలో డిగ్రీలు లేనివారు స్వతంత్ర ప్రతిపత్తిగల తాత్త్వికచింతన చేయగలగడం చాలా ఆశ్చర్యం కలిగించినట్లుగా 'పీఠిక' లో కె. సచ్చిదానందమూర్తి వెల్లడించడం చాలా విచిత్రంగా వున్నది.







'సిన్సియర్లీ యువర్స్' లోని అచ్చు తప్పులు పుస్తకం అంతా యిట్లాగే వుంటాయేమో అనే భయం కలిగిస్తాయి. అయితే తక్కిన పుటల్లో అచ్చు తప్పులు లేకపోవడమేగాదు, స్పష్టమైన, అందమైన ముద్రణ సాఫీగా చదువుకోవడానికి సహాయపడుతుంది. మనోజ్ఞమయిన 'బాపు' ముఖచిత్రం, ముద్రణ విషయంలో తీసుకున్న శ్రద్ధ రచయిత కళాత్మకతను వెల్లడిస్తున్నాయి. అందంగా ఆలోచిస్తూ, ఆనందంగా జీవించడమెట్లాగో తెలుసుకో గోరిన వారు, యింగ్లీషులో రచింపబడిన యీ బయోసింఫనీ (BIOSYMPHONY) రచన తప్పక చదవాలి.

— సరోజినీ ప్రేమ్‌చంద్

## ఈ మధ్య అందినవి :

ద్రావిడ సాహిత్య సేతువు - ఆచార్య చల్లా .... ద్వాఫా శాస్త్రి. డి. దుర్గ, అమలాపురం .... రు 10-00.

ఏం చెప్పను నేస్తం - కవితా సంపుటి. నాయని కృష్ణకుమారి .... విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - 1 .... రు 25-00.

పుట్టని బిడ్డకు తల్లి ఉత్తరం. ఒరియానా ఫాలసీ రచన, తెలుగు : ఓల్గా. ఫెమినిస్ట్ స్టడీ సర్కిల్, హైదరాబాదు - 34 .... రు 8-00.

తిరుక్కురళ్ - తమిళ వేదం. చల్లా రాధాకృష్ణశర్మ .... విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాదు - 1 .... రు 30-00.

కార్మిక గీతం - నవల. అక్కినేని కుటుంబరావు .... స్వేచ్ఛ ప్రచురణలు, హైదరాబాదు - 34 .... రు 15-00.

Politicians of Simuria by John Savant ... Bala Rao Madras - 86 ... Rs. 16- 00.

Path to Cosmic Consciousnes by John Savant ... Bala Rao Madras - 86 ... Rs. 5-00.

ఇందిరాగాంధి .... అలక్స్యాందర్ గొరేవ్‌ల్ .... 'సోవియట్ భూమి మద్రాసు - 17.

సందిగ్ధ సంధ్య - కవితలు. కొండేపూడి నిర్మల .... నవోదయ బుక్ సెంటర్, విజయవాడ - 2 .... రు 8-00.

గాలిబ్ ప్రేమశతకం - ఇక్బాల్ ఆత్మశతకం. బెజవాడ గోపాలరెడ్డి .... ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు - 1-.... రు 10-00.

అల్లామ ఇక్బాల్ - కవితలు. బెజవాడ గోపాలరెడ్డి .... ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు - .... రు 12- 00.

కథాకని 1999-3 ; కృష్ణమూర్తి 1989-3 ; TACT 1989 - 2 .... సంవత్సరానికి నాలుగేసి చొప్పున .... ఒకొక్కటి సం॥కి పదిరూపాయలు .... శ్రీ విరించి .... ప్రాప్తి బుక్స్, మద్రాసు - 90.

అందుకున్నవన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి. ❋

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీ జనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువ లేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు. ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పర రతతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శ ప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవితవి శేషాలు, అనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - 8 9జులై నెల నుండి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

ఇప్పుడు నెల్లూరిలో నుండు విపుకుల మాలె కొండయ్యగారు, ముంగమూరి విశ్వనాధ రావుగారు, సుబ్బారావుగారు, బెజవాడ రామచంద్రరెడ్డిగారు మొదలగువారు ఆ వనభోజనమున భుజించినవారె.

విద్యార్థులను జూచిన నాకు ప్రేమ అధికము. పేద విద్యార్థులకు చాలా మందికి చదువు చెప్పించితిని. విద్యార్థులను B.A., M.A. వరకు చదివించితిని. వారందరు కూడ మంచి ఉద్యోగములలో యున్నారు. నేను వారిని చూచినప్పుడు ఆనందించుచుందును. పరులకు చేసిన మేలును చెప్పుకొనకూడదను న్యాయము నాకు దెలిసినను ఈ సందర్భములో చెప్పవలసివచ్చినది.

## 13 నా రెండవ వివాహం

ఇప్పుడు నాకు 43 సం॥ వయసు అయినది. రోగ పీడితురాలయిన భార్య యింట యున్నది. ఇంటిలో మరి యెవరును లేరు. నాకు కొంత ఆస్తి, ఇల్లు, వ్యాపారము చేకూరినది. సంతానము లేదు. సంపాదించిన సొత్తునకు వార్సులు లేరు. ఈ సమయమున నా బావమరది కొడుకును దగ్గర తీసితిని. వాడు త్వరలోనే చనిపోయిన వెంటనే మాకు విరక్తి భావము మనసునకు తోచి ఇరువురము తీర్థయాత్రలకు ప్రయాణమైతిమి. ఉత్తర దక్షిణ యాత్రలన్నియు మూడు మాసములలో ముగించుకొని యిల్లు చేరితిమి. నా భార్య జబ్బు దినదినాభివృద్ధి యగుచుండెను.

సంతానముకొఱకు మేము తీర్థయాత్రలన్నియును ముగించుకొని యిల్లు చేరితిమి. నాకు సంతానాపేక్ష అధికమగు కొలది, నాభార్యకు జబ్బుకూడా అధికమై లేవలేనంత స్థితికివచ్చి మంచమెక్కెను. ఆమెకు వుపచారము చేయుటకుగాని నాకు సహాయపడుటకుగాని ఆఇంటిలో కూలివారు తప్ప మరి యెవరును లేకపోయిరి. నా ఉద్యోగము పెద్దది. ఈ పరిస్థితులలో నేను రెండవ వివాహమును చేసుకొనుటకు నిశ్చయించుకొంటినిగాని 43 సం॥ నాకు తగువయస్సు వచ్చిన పెండ్లాము యెట్లు లభించగలదు ?

కొచ్చిన్ రాజ్యమున కేరళ స్త్రీలను బ్రాహ్మణులు వివాహమాడు సాంప్రదాయమున్నదని తెలుసుకొని 30 సం॥ ముందు తిరుమూరులో కేరళ స్త్రీని వివాహమాడితిని. అప్పుడామెకు 28 సం॥ వయసుండును. ఒక వకీలు కుమార్తె. విద్యావంతురాలు. ఆయుర్వేద వైద్యమునందు పరిచయము గలది. ముఖ్యముగ స్త్రీల రుగ్మతలను కనుగొని చికిత్స చేయు నిపుణురాలు. [illegible] దెలియును. ఔషధములను చక్కగా తయారుచేయు అనుభవమును

# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతటతానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం—బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



డా॥ రాజశేఖర్
సమర్పించు

జె.ఆర్.ఆర్. ప్రొడక్షన్స్

# మంచివారు మావారు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: ఐ.వి.శశి



నిర్మాతలు: గుణశేఖర్. జీవిత. పద్మజ
నిర్మాణ నిర్వహణ. ఏ.ఎమ్.రత్నం

గలది. ఓషధి జ్ఞానమున్నది. ఈమె నాయింటికి వచ్చిన పిమ్మట కేసరి కుటీరములో తయారుచేయు ముఖ్యౌషధము లన్నియును ఈమెయే తయారు చేయుచున్నది. వైద్యశాలకు వచ్చిన స్త్రీలను, బిడ్డలను పరీక్షించి చికిత్స చేయుచున్నది. క్రమముగ ఆఫీసు పనులను నేర్చుకొనినది. ఇంటిపనులను మెళకువతో గమనించుచు నాకు తోడునీడ అయినది. ఇప్పుడు నాకు చాల భారము తగ్గినది. ఈమె పేరు మాధవి.

ఈమె నాయింటికి వచ్చిన మరుసటి సంవత్సరమున నాకు కుమార్తె పుట్టినది. కుమార్తెపేరు శారదాదేవి. ఈ కుమార్తెకు యుక్తవయసు రాగానే వివాహప్రయత్నమును చేయవలసివచ్చినది. తిరుచూరుకు సమీపమున సుప్రసిద్ధ క్షేత్రము గురువాయూరు గలదు. ఇది విష్ణుక్షేత్రము. మన ప్రాంతమున తిరుపతికొండ వెంకటేశ్వర్లు యెంత ప్రసిద్ధియో కేరళరాజ్యమున గురు వాయూరు విష్ణుమూర్తికి అంత ప్రఖ్యాతి. ఈ దేవుని 'గురువాయూరు అప్పన్' అనెదరు. ప్రతిదినము ఈ దేవుని పూజించుటకు వేలకొలది భక్తులు వచ్చి పూజించి పోవుచుందురు. ఈ నారాయణ క్షేత్రమున నంబూదిరీ బ్రాహ్మణ పండితోత్తములు కొందరు చేరి నారాయణ జపము, భజన, ఉపన్యాసములను ఇచ్చు పండితబృంద మొకటి గలదు. ఆ భక్తబృందమునకు చేరిన దివాకర నంబూదిరి బ్రాహ్మణుడు గలడు. ఈయన వేదాంతాది శాస్త్ర వేత్త, భక్తుడు, భాగ్యవంతుడు. వీరి కుమారుడగు చిరంజీవి బాలకృష్ణునకు నాకుమార్తె చి॥ సౌ॥ శారదనిచ్చి వివాహమును చేసితిని. ఈ నంబూదిరి బ్రాహ్మణునిభార్య సుప్రసిద్ధ నడుంగాడి కుటుంబమునకు చేరిన కేరళస్త్రీ. నా అల్లుడు M.B.B.S. డాక్టరు పరీక్షనిచ్చి మద్రాసు జనరల్ హాస్పటలులో యుండి పిమ్మట, ఇటీవల ముగిసిన రణరంగమునకు వెళ్లి తిరిగివచ్చి మద్రాసులో జనరల్ హాస్పటలులోనున్నాడు (Capt. T. M. B. Nedonnadi, I.M.S ). వీరికి యిప్పుడు నలుగురు బిడ్డలు గలరు. పెద్దకుమారుని పేరు రాధాకృష్ణ, రెండవ కుమారునిపేరు బాలకేసరి. మూడవ కుమార్తెపేరు మధుమాధవి. చిన్న కుమారుని పేరు జయచంద్రుడు. మాఅల్లుని యిద్దరి చెల్లెండ్రను కొచ్చిరాజు కుమారులగు రాజా కేరళవర్మ, రాజారామవర్మ రాజులకిచ్చి వివాహమును చేసిరి. ఈ యిరువురు రాజబంధువులేగాక మూడవవారగు రాజారవివర్మగారు కూడ దగ్గర బంధువు. వీరు రాజ్యమును చేయుటకు సమీపమున నుండినవారు. కనుక నా రెండవ కల్యాణమువలన రాజబంధువులుకూడ నాకు గలరు. ఈ రాజకుమారులు సదాచార సంపన్నులు. దేవ బ్రాహ్మణ భక్తిగలవారు. మద్రాసులో కొచ్చిరాజులకు కొచ్చి భవనము (Cochin House) ఉన్నను, వీరు మద్రాసుకు వచ్చినప్పుడెల్లను నాయింటనే బసచేయుచుందురు. మేము మైసూరులో కాపురమున్నప్పుడు చాముండేశ్వరి

మాకు రెండవ కుమార్తెను ప్రసాదించినది. ఈమెపేరు వసంతకుమారి నామరదలు కాత్యాయనియను ఆమె వితంతువు; బిడ్డలు లేరు. నాయింటనే బిడ్డలను కనిపెట్టుకొనియున్నది. నా రెండవభార్య అక్క కుమారులు నాయింట వుండి చదివినవారు. పెద్దవాడు కే. గోవిందమీనన్, ఐ.సి.యస్. (K. G. Menon, I. C. S.) తిరువనంతపురమున చీఫ్ సెక్రటరిగ నున్నాడు. రెండవవాడు కుమారమీనన్ (Col. K. K. Menon, I. M. S.) కాశ్మీరములో మిలిటిరీ డిపార్టుమెంటు డాక్టరుగ పనిచేయుచున్నాడు. నాభార్య తమ్ముడు కృష్ణమీనన్ (K. K. Menon, B. A. B. L.) పాలఘాటు దేవాలయములో బోర్డుతరుపున ఎక్జిక్యూటివు ఆఫీసరుగ నున్నాడు. ఇతడుకూడ మద్రాసులో నాయింటనుండియే చదివినవాడు. ఈ భార్య చెల్లెలి కుమార్తె జానకమ్మ నాయింటనుండియే బి.ఏ.బి.టి., చదివి ప్యాసుచేసి క్వీన్ మేరీస్ కళాశాలలో గానకళాధ్యాపకురాలుగా నున్నది. నా అల్లుని తమ్ముడుకూడ నాయింటనే చదివి ఇప్పుడు మెడికల్ కాలేజిలో యక్సురే డిపార్టుమెంటులో పనిచేయుచున్నాడు. నూతన బంధుత్వమైనను ఈ ఆలి వంకవారందరు ఈ విధమున నా యందు భక్తిశ్రద్ధలు కలిగి ఈ స్థితిగా వృద్ధికి వచ్చుచున్నారు.

## కొచ్చిరాజ్య ప్రశంస

కొచ్చిరాజ్యము కేరళదేశములో నొక స్వతంత్రరాజ్యముగ నుండెను. ఈ రాజ్యమును చూచి ఉప్పొంగని వారుండరు. దేశమంతయు ఉద్యానవనముగ కన్పించును. ఇది పడమటి సముద్రతీరమున నున్నది. పడమట కనుమలు ఈ రాజ్యమును అనుసరించి బారులుతీరి యుండును. కొచ్చిరాజ్యము గొప్ప కొండలతోను అడవులతోను కూడి యున్నది. భూమి చాలభాగము గుంట మిట్టలతో నుండుటవలన పంటలకు ముఖ్యముగ వర్షమే ఆధారము. ఈ రాజ్యమున వర్షకాలము యేడుమాసము లయినను ముఖ్యముగ జూను జులై మాసములు యెడతెగక రాత్రింబవళ్ళు కుంభవర్షము కురియును. ఇక్కడ వర్షాకాలము ఎండాకాలములేగాని శీతకాలములేదు. జోరున వర్షము కురియునప్పుడుకూడ వుక్కపోయుచుండును. ఈ కారణము వలన ఇక్కడి వారందరు వంటినిండుగ వస్త్రములను ధరించరు. వీరు దినమునకు రెండు పర్యాయములైనను గుంటలలో స్నానమును చేయకుండ నుండలేరు.

కొచ్చిరాజ్యమును పాలించుచుండిన రాజులు హిందువులు. వీరందరు హిందువుల ఆచారముల ననుసరించి స్నానసంధ్యాది దినచర్యలను ఆచరించు ఆచారవంతులు, దేవబ్రాహ్మణ భక్తిగలవారు. నిరాడంబరముగ జీవయాత్రను

నలువు వైదికశాఖామణులు. మహారాజుకూడ అయిదు మూరల అంగవస్త్రము తోను, మూడు మూరల పైపంచెతోనున్నాడు. వీరు బనియను తొడుగు కొనుటకూడ ఆచారమునకు విరుద్ధమని యెంచెదరు.

కొచ్చిరాజ్యమున రాజకన్యకలందరు నంబూదిరి బ్రాహ్మణులనే వివాహ మాడివలయుననే నిర్బంధమగు ఆచారము గలదు. నంబూదిరి బ్రాహ్మణులనగ కేరళ దేశవాసులగు శంకరాచార్యులవారి తెగకు చేరినవారు. నంబూదిరి బ్రాహ్మణవరునకు రాజకన్యకల నిచ్చి వివాహము చేయునప్పుడు వరునకు రాజులు మిక్కిలి రొక్కముల నిచ్చెదరు. ఈ బ్రాహ్మణభర్త భార్యయింటనే, వినయవిధేయతలతో చేతులు కట్టుకొని నివసించి యుండవలయును. ఈయిరువురకు పుట్టిన పుత్రునకే కొచ్చి రాజ్యాధికారము నుండెడిది. రాకుమారి తలతో కూడ కొచ్చి సంస్థానకుటుంబము నాలుగువందల వరకును వుండును. ఇంతపెద్ద విభక్త కుటుంబము మరియెక్కడ నుండదు. ఈ రాజకుటుంబ ములో మూడుశాఖలకు చెందినవారుగలరు. వారు రామవర్మ, రవివర్మ, కేరళవర్మ అను వంశములకు చెందినవారు.

## తిరుపునత్తొర

ఈ తిరుపునత్తొరయను చిన్నపట్టణము కొచ్చి రాజకుటుంబములో నుండు రాజకుమారులు, రాకుమారితలు నివసించుటకు ప్రత్యేకముగ నిర్మించిన రాజన గళ్లు గల స్థలము. ఈ నగరమందుండు చిన్నకొండ పైన మహారాజు నివసిం చుటకు సుందరమైన భవనము నిర్మించబడియున్నది. ఈ రాజభవనమునకు హిల్ పాలెస్ (Hill Palace) అని పేరు. తక్కిన రాజకుమారులకు కుమారి తలకు వేరు వేరు భవనములు నిర్మింపబడియున్నవి.

ఈ పట్టణమున గొప్ప విష్ణ్వాలయముగలదు. ఈ దేవాలయము గర్భ గుడిలో ప్రవేశించి దేవుని పూజించుటకు రాజకుమారికలకు మాత్రమే స్వతంత్ర మున్నదిగానీ రాజులకులేదు. ఏలననగా కేరళదేశముపై టిప్పు దండెత్తివచ్చి నప్పుడు ఈ క్షేత్రమున యుండు రాజకుమారులందరు ఆడవారిని యింటవిడిచి ప్రాణభీతికి పరారి చిత్తగించరట. అప్పుడాపూరనుండు రాజకుమార్తెలకు దిక్కు దోచక ఆ విష్ణ్వాలయము ప్రవేశించి వారు ప్రాణభిక్షకు దేవుని ప్రార్థించిరట. అప్పుడు టిప్పు ఆ దేవాలయమునకు రాకుండ వూరువిడిచి పోయెనట. ఈ కారణమున విష్ణుమూర్తి ఆడవారిని అనుగ్రహించెనట. ఈ పురాతనకథ నను సరించిన ఆచారము ఇప్పటికిని ఈ దేవాలయమున జరుగుచున్నది.

కేరళస్త్రీలు వివాహమాడవలయునని నిర్బంధము లేదు. అనేక యిండ్లలో బ్రహ్మచారిణులున్నారు. సన్యాసినులున్నారు; వేదాంతవేత్తలున్నారు ; కేరళదేశ వాసులు శాక్తేయులు. స్త్రీలు విభూతి కుంకుమలను ధరించుకొనెదరు. ఉమా, కాత్యాయిని, పార్వతి, శారద, మాధవి మొదలగు పేర్లను పెట్టుకొనెదరు. ఈ దేశమున శక్తి ఆలయములుమెండు. కేరళస్త్రీలు వైధవ్య చిహ్నములను అంతగా పాటించుట లేదు. పునర్వివాహము సర్వసామాన్యము. విడాకులు అమిత సులభము, స్త్రీ స్వాతంత్ర్యదేశ మగుటవలననే దీనికి స్త్రీ మళయాళమని పేరుకూడగలదు. ఈ దేశమున నంబూదిరి బ్రాహ్మణులకు మంచి పలుకుబడి గలదు.

## తిరుచూరు

తిరుచూరు కొచ్చిరాజ్యమునకుచేరిన మంచి వాసయోగ్యమైన పట్టణము. కొచ్చిరాజ్యమునకెల్ల ఈ వూరి భావుల జలము మంచి ఆరోగ్యమునిచ్చునవి. ఈవూర 7 మాసములు వర్షకాలమగుటచే బావులలో నీరు పైభాగమువరకు వచ్చుచుండును. నేల కంకరభూమి అగుటవలన నీరు నిర్మలముగ నుండును. కేరళదేశస్తులు నీళ్లను చూచినప్పుడెల్లను స్నానము చేయుటకు ఇష్టపడెదరు. కనుకనే వీళ్లను 'నీళ్లకోళ్లు' అనెదరు. ఈ వూరిలో అక్కడక్కడ స్నానము చేయుటకు తటాకములు గలవు. ప్రతిదేవాలయము ప్రక్కనను స్నానముచేయు కోనేళ్లు కలవు. ఇక్కడివారికి చెంబుతో నీరును నెత్తిన పోసుకొను అలవాటులేదు. గుంటలలో మునిగి స్నానముచేయనిది వీళ్లకు తృప్తిలేదు. ఇక్కడి వారికందరికి ఈత తెలియును. ప్రజలందరు ప్రాతఃకాలమున లేచి స్నానముచేసి దేవాలయములకుపోయి దేవుని పూజించిన పిమ్మటనే వారివారి ఉద్యోగములకుపోవు ఆచారము గలదు. ఈ దేశము వారు ప్రతిదినము భోజనపదార్థములలో కొబ్బెర తురుమును, కొబ్బెర నూనెను విరివిగ వాడెదరు. స్నానమును చేయునప్పుడు వీరు వంటికి తలకు టెంకాయ చమురును పట్టించుకొని స్నానమును చేసెదరు. ఈ అలవాటు వలన వీళ్లకు చర్మవ్యాధులు రావు. స్త్రీల శిరోజములు దీర్ఘముగ పెరిగి తుమ్మెద రెక్కల వలె నల్లగ మినమినలాడుచుండును. వీరు వేడినీళ్ల స్నానమెరుగరు. వీరి భోజనము సాత్వికాహారము. వీరిలో విద్యరానివారరుదు. కేరళరాజ్యమున స్త్రీలకు ఉండునంత స్వతంత్రము పురుషులకులేదు. పురుషుడు భార్యయింటికి పోవలసినదేగాని భార్య పుట్టిల్లు విడిచి మగనింటికి పోదు. పురుషులకు స్త్రీలకున్నంత స్వతంత్రము లేకుండుట వలననే వారు ఇండ్లువిడిచి పరదేశము లకుపోయి నౌకర్లను సంపాదించుకొని సుఖముగనున్నారు. విద్యాలయములలోను

వైద్యాలయములోను వీరే అగ్రస్థానములను ఆక్రమించుకొనియున్నారు. ఈ దేశంలో స్త్రీ విద్యాభివృద్ధి అధికమగుట వలన పెద్దడిగ్రీలనుపొంది గొప్ప నౌకర్లను చేయుచున్నారు. పూరిండ్లనుకూడ వీరు బహుశుభ్రముగ పెట్టుకొనను నేర్పర్లు. ఈ రాజ్యమున ప్రతి ఆఫీసులోను స్త్రీలు నౌకర్లను చేయుచున్నారు. సంపన్నుల కుటుంబములలో చాలమంది పెద్దడిగ్రీలను తీసుకోక గృహపరిపాలనచేయుచు సుఖముగ యింటనున్నారు. సంపన్నుల యిండ్లలో స్నానమును చేయుటకు తోటలలో తటాకములను త్రవ్వించుకొని యిష్టము వచ్చినప్పుడెల్లను స్నానము చేయుంచుచుందురు. తమయిండ్ల చుట్టు వివిధఫలవృక్షములను నాటి పెంచి, వాటి ఫలములను అనుభవించెదరు. అనేకరకములైన అరటి, పనస, ముఖ్యఫలవృక్షములు, జాజికాయ చెట్లునుండును. ప్రసిద్ధములైన కొబ్బరిచెట్లుగలవు. ఇక్కడ అరటిఆకులలో పొడుగాటిమనిషి పడుకొని హాయిగ నిద్రించవచ్చును. ఈవూరి నేంద్రం అరటిపండ్లు చాల ప్రశస్తము లయినవి, మంచి ఆరోగ్యమునిచ్చు ఫలములు. మంచి ఆకలి కలిగినప్పుడు రెండు మూడు పండ్లను భుజించిన ఆకలితీరును. ఈ వూరి పనసపండుతోను నేంద్రం అరటిపండుతోను హల్వాను తయారుచేసి జాడీలలో నిల్వయుంచుకొని పండుగలకు పాయసమును చేసి భుజించెదరు. ఈ దేశమును శుభకార్యములకు పిండివంటల కంటె పాయసములే ముఖ్యములు. పాలుపాయసం (బియ్యం, పాలు, చక్కెర), చక్కప్రధమన్ (పనసపండు, బెల్లం పాయసం) నేంద్రపళం ప్రధమన్ (నేంద్రఅరటిపండు, బెల్లం పాయసం) పచ్చపయిరు ప్రథమన్ (పెసరపప్పు, బెల్లం, కొబ్బరతురుం పాయసం) ఈలాటివి యింకను కొన్ని పాయసములను తయారుచేసెదరు. నేంద్రం అరటికాయలతో వుప్పగాను తీపిగాను వరవలుచేసి నిల్వవుంచుకొని కాఫీతోకూడ చిరుతిండిగ నుపయోగించెదరు. బిడ్డలకు బిస్కతులకు బదులు వీటి నిచ్చెదరు.

తిరుచూరు అష్టాంగ ఆయుర్వేదవైద్యమునకు పుట్టినిల్లు, శాస్త్రసమ్మతమైన ఔషధరాజములను తయారుచేయుటకు వనఓషధులు యిక్కడ లభించునటుల మరి యెక్కడను లభింపవు. తెల్లవారగనే పడమటి కనుముల నుండి పచ్చిమూలికలను మోపులు మోపులుగ దెచ్చి విక్రయించెదరు. ఒకేతడవ సుగంధిపాలవేరు, అశోకపట్ట, బిల్వవేరు మొదలగునవి యెన్ని టన్నులు కావలసినను దొరకును. ఈ వూరినిండుగ ఓషధి ద్రవ్యములను, ఔషధములను విక్రయించు అంగళ్లు గలవు. ఇక్కడివారు ప్రతిదినము యేదో ఒక తైలమును వంటికి, తలకు రాచుకొననిది స్నానమును చేయరు. వాత వ్యాధులను కుదుర్చుకొనుటకు పలుదేశములనుండి యిక్కడికివచ్చి చికిత్సలను పొందెదరు. నవరక్కిళి, పిళింజలు, ధార మొదలగు ప్రత్యేక చికిత్సలను చేయుటకు యిక్కడ



# ?

"Dad, is it true that Bharata after having gone into the forest and after his failure in persuading Rama to come back to Ayodhya, threatened to commit harakiri ?"

"Oh boy, that is a bad word, not in tune with our culture or context. Lying down on a sort of grass called *Kusa*, Bharata commenced *Prayopavesa* - that means no food, no water, no sleep," said Father.

"I understand, It is hunger - strike of olden times," observed Raghu.

"Again you are wrong. *Prayopavesa* was never meant to achieve an unfulfilled desire. Rama admonished Bharata ; 'We have to carry out the wishes of our departed father, Dasaratha - that is our sacred duty and we should not budge an inch from that path. I shall condone you an as elder brother only if you do *Prayaschitta* for the sin of attempting to commit an act to end yourself and thereby bring shame on our ancestors.' Bharata meekly submitted, did the penance and fell on the feet of Rama.... With irrestible charm, every episode has a message."

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



సమర్థులున్నారు. ఇక్కడ సర్కారు ఆయుర్వేద వైద్యశాల యున్నది. సుప్రసిద్ధ మూసు వైద్యవేత్తలు యిక్కడివారే. వీరు నంబూదిరి బ్రాహ్మణులు ఈ కుటుంబమునకు చెందిన వైద్యులు అక్కడక్కడయున్నారు.

## తిరుచూరు ' కేసరికుటీరం '

ఔషధములను తయారుచేయుటకు అన్ని అనుకూలములు యిక్కడ నున్నందున ఈవూరిలో 15 సంవత్సరములకు మునుపు కేసరికుటీరమును స్థాపించితిని. ఈ కుటీరమును విశాలమైనతోటలో నిర్మించితిని. నివసించు టకు చలవరాళ్లు పరువబడిన మంచి బంగళాను. ఔషదములను తయారు చేయుటకు అనుకూలమైన కట్టడమును, వనమూలికలను దెచ్చి శుభ్రపరచి సారహీనము కాకుండ భద్రపరచుటకు తగువైనస్థళమును, ఆఫీసుకు, అతిధులకు ప్రత్యేకమైన గృహములును నిర్మించబడి యున్నవి. ఈ కట్టడము లన్నియు విశాలమైన తోటలో నున్నవి. ఈ కర్మాగారమునకు మంచి నీటివసతి కావలసి యుండుట వలన మూడుబావులను త్రవ్వించి వాటికి ఎలెక్ట్రిక్‌పంపుల సమర్పించితిని. నీళ్లనింపుటకు టాంకును (తొట్టి) కట్టించి, నివసించు యింటికి కొళాయీలు పెట్టించి తొట్టిస్నానము, షవర్‌బాత్ (Shower Bath) మొదలగువానికి సౌకర్యములను చేసితిని.

ఈ వూరిలో ఆయుర్వేద ఔషధములను తయారుచేయుటకు మంచి మూలికలు దొఉకుటయేగాక సమృద్ధిగ మంచినీరుగలదు. కట్టెలకు కరువులేదు. కూలీలు సులభముగ దొరకుదురు. ఈ సౌకర్యములన్నియు యిక్కడ నుండుటవలన వేసవికాలమంతయు నేను యిక్కడనే గడుపుచు ఔషధములను తయారుచేయించుచుందును.

ఈ వూరి ఆయుర్వేదవైద్యులు ఇంగ్లీషుడాక్టర్లవలె రోగులకు కావలసిన మందులకు జాపితా (Prescription) వ్రాసియిచ్చెదరు. కనుక రోగులే అంగళ్లకుపోయి జాపితా ప్రకారము మూలికలను దెచ్చుకొని, మందులను వారే తయారుచేసుకొని సేవించెదరు. ఈ కారణమువలన ఈవూరి వారందరును సామాన్యముగ ఔషధములను చక్కగ తయారు చేయు అనుభవము గలిగియున్నారు.

తిరుచూరు మధ్యలో గొప్పశివాలయము గలదు. ఈ స్వామి పేరు వడకనాధన్ ఇది పరశురాముల ప్రతిష్ఠ. ఈఆలయములోని శివలింగము పైకి కనుపడదు. ఈలింగమునకు ప్రతిదినము నెయ్యిని అభిషేకమును చేయుట

వలన పేరిన నెయ్యిని లింగాకారముగ సుమారు 10, 12 అడుగుల పొడవుగ కనుపించును. ఈ లింగము వేసవికాలములో కూడ కరుగకపోయినను నెయ్యి భారమువలన అప్పుడప్పుడు విరిగి కూలుచుండును. ఈ విరిగిన నెయ్యి చర్మవ్యాధులకు మంచిమందని కొందరు కొనుక్కొనిపోవుదురు. ఈదేవాలయ ప్రవేశమప్పుడు చొక్కాయి ధరింపకూడదు. చేత గుడ్డ గొడుగునుంచుకో కూడదు. బ్రాహ్మణులు, నాయర్లు మాత్రమే యిందు ప్రవేశించుటకు హక్కు గలదు.

ఈ దేవాలయములోని అర్చకులు చక్కగ చదువుకున్న నంబూదిరి బ్రాహ్మణులు; మంత్రశాస్త్రవేత్తలు, సంస్కృతపండితులు, బ్రహ్మచారులు. వీరు పొరపాటున యెప్పుడైన స్త్రీలనుచూచుట తటస్థించునేమోయని వీళ్లకు ప్రత్యేకముగ దేవాలయ ఆవరణములోనే ఇంటినిగట్టించి ఇంటిచుట్టూ పెద్ద ప్రహరీగోడను కట్టి అక్కడ వీరు నివసించుటకు నిర్బంధమగు యేర్పాట్లు గలవు. ఈ యింటివాకిట సిపాయిఘారాకూడా కలదు. వీరు నివసించు యింటి నుండి దేవాలయమునకు పోవుటకు ప్రత్యేకమైన సందు దోవను యేర్పాటు చేసి వున్నారు. ఈ అర్చకులు రాత్రి 3 గంటలకు నిదురలేచి వారు నివసించు ఆవరణములోని గుంటలో స్నానమునుచేసి, అనుష్టానములను తీర్చుకొని దేవతార్చనకు పోయెదరు. ఈ దేవాలయపు పూజారులలో కొందరు గొప్ప మంత్రవేత్తలున్నారు. వీళ్లనుగురించి యిక్కడ గొప్పగ చెప్పుకొనెదరు.

ఈ దేవునకు ప్రతిసంవత్సరము 'పూరం' అను ఉత్సవము జర్గును. ఈ ప్రాంతమున కెల్లను ఇది గొప్ప తిరునాళ్ల. ఈ ఉత్సవములో విశేషమేమన 12 గొప్ప ఏనుగులను బంగారు తొడుపులతో అలంకరించి దేవుని వూరేగించెదరు. కొచ్చిరాజ్యము గొప్ప ఏనుగులకు ప్రసిద్ధమైన స్థలము. ఈ యేనుగులు దేవాలయమునుండి బారులుతీరి సోల్జర్లు (Soldiers) నడిచినట్లు అడుగులను వేయుచు నడుచునప్పుడు ఆ దృశ్యము అద్భుతమును గలుగ చేయును. ఇటువంటి వుత్సవము మరియెక్కడను వుండదు. ఈనాడు రాత్రి స్వామికి బాణవేడుక జర్గును. ఈ బాణవేడుకను రెండుకక్షలవారు ఒకరికంటె ఒకరు బాగుగ చేయవలెననే యేర్పాటును చేయుదురు. ఇందుకు వీరు చాల ధనమును ఖర్చు పెట్టుదురు. రాత్రి 10 గంటలు మొదలు తెల్లవారి 5 గంటలవరకు బాణవేడుక జరుగును. ఈ బాణవేడుకకు తగిన మందు సామానులను తయారు చేయుటకు తిరుషూరు చాలప్రసిద్ధి చెందినది. ఈవూరు మంచి కంచుపాత్రలకును గడ్డిచాపలకును పేరుపొందినది.

# 14 తీర్థయాత్రలు

## కాశీయాత్ర

అలహాబాదులో 1910 సం॥ డిశంబరు నెలలో కాంగ్రెసు మహాసభ జరిగినది. ఈసభకు నేనును, నెల్లూరినుండి పబ్లికు ప్రాసిక్యూటరుగనుండిన శ్రీ మైదవోలు చంగయ్య పంతులుగారును, వెంకటగిరిరాజాగారి ఉన్నత పాఠశాలకు అప్పటి ప్రధానోపాధ్యాయులు శ్రీమాన్. ఏ. సంతాన రామయ్యం గారును, అభ్రకపుగని స్వంతదారులగు శ్రీ విస్సా లక్ష్మీనరసయ్యపంతులు గారును వెళ్లితిమి. మహాసభానంతరము అక్కడనుండి కాశీయాత్రకు వెళ్లితిమి. నేనును, విస్సా లక్ష్మీనరసయ్య పంతులుగారును కుటుంబములతో బయలు దేరితిమి.

కాశీలో తీర్థవాసియగు పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రియింట బసచేసితిమి. వీరు పూర్వము రాజుమహేంద్రవర ప్రాంతములకు చెందిన ఆంధ్రులు. ఈ తీర్థవాసులు చాలకాలమునుండి ఇక్కడనే స్థిరనివాసియై మంచి స్థిరాస్థిని సంపాదించినవారు. కొన్నిగృహములకు యజమానుడు. మమ్ముల నొక గృహమునందుంచెను. వీరి వ్యాపారమును సాగించుటకు, వీరివద్ద కొందరు గట్టివారు గుమాస్తాలుగనుండిరి. వారిలో ఒక గుమాస్తాను మాకు అప్పచెప్పిరి.

'వారణాశి' అని కాశీకి మరొక పేరు, 'వారణా' — 'అశి' — అని రెండు ఉపనదులు కాశీకి రెండువైపుల ప్రవహించి గంగలో కలియును. ఆ రెండు నదుల మధ్యయుండుటచే 'వారణాశి' అని అపట్నమునందురు. పట్నమంతయు అర్ధచంద్రాకారముగ నదిగట్టున పొడవుగానుండును. పురాతన పట్నమగుటచే కాబోలు, ఎత్తైన ఇండ్లతో, మేడలతో, ఇరుకువీధులతో నిండియుండును. కావున తెలిసినవారి సహాయములేనిదే కొత్తవారు ఆ పట్నములలో తిరిగజాలరు. నది పొడవున — గొప్పభవనములున్నవి. ధనాఢ్యులు పలు ప్రాంతముల నుండి పిదప కాలమున వారణాశిలో నివసించి, అక్కడనే మృతిచెందిన - సరాసరి స్వర్గముచేరుదమని, అభవనముల కాపురముందురట. నది పొడవున పురాణప్రసిద్ధములు చరిత్రాత్మకములునగు అనేక 'ఘట్టము'లు కలవు. దశాశ్వమేధఘట్టము, హరిశ్చంద్రఘట్టము మున్నగునవి అట్టివే. ఇక్కడనే ఊరిమధ్య 'జ్ఞానవాపి' లేక 'కూపము' కలదు. యాత్రికులు అక్కడకువెళ్లి పూలుపండ్లు అందువేసి పవిత్రులు, 'జ్ఞానవంతులు' నగుదురు. అయితే వారు అందువేసిన వస్తువులు కుళ్లి దుర్గంధములే అగుచుండును. 'గాడిదేవి గుడి'యని -

యొకటి హరిజనవాడ మధ్య నున్నది. ఎంతటి ఆచారవంతులైనను ఆ వాడకు అరమరికలు లేకుండా వెళ్లి గవ్వలు కొన్ని ఆ గుడిలోవేసి వచ్చినగాని కాశీయాత్ర ఫలితము దక్కదు అని వాడుక. నది కావలిగట్టు కాశీమహా రాజుగారు నివసింతురు. వారి ఆఫీసులు అక్కడనే యుండును. యాత్రికులలో నుత్సాహవంతులు కొందరు పడవలపై నది దాటి వానినన్నిటిని చూచి వత్తురు. పలుదేశముల నుండి పలువురు వచ్చి పోవుచుందురుగాన పట్టణమున 'గల్లీ' లు (వీధులు) చాల అపరిశుభ్రముగా నుండును.

## కాశీ క్షేత్రము - ప్రాముఖ్యము

వఃమణి కర్ణికాసమంతీర్థం - విశ్వేశ్వర సమంలింగం
వఃకాశీ సదృశీపురీ - వాస్తి బ్రహ్మాణ్డగోళకే

అను పూర్వుల సుభాషితమును విననిహిందువు ఉండడని తలచెదను. మహమ్మదీయులకు మక్కా, క్రీస్తువులకు జరూసలము, బౌద్ధులకు బుద్ధగయ ఎటులనో హిందువులకు శ్రీ కాశీక్షేత్రము అటువంటిది. శ్రీ రామచంద్రాదులు గయా శ్రాద్ధమును బెట్టినట్లును, ప్రయాగలో అనేక యజ్ఞయాగాది క్రతువులను జరిపినట్లును పురాణేతిహాసములు గలవు. హిందువులకు ఈ పుణ్యభూములను దర్శించి కడతేరవలయుననే కోరిక మాత్రమేగాక 'కాశ్యాంతు మరణాత్ ముక్తిః' అను వచనము ననుసరించి ప్రాణప్రయాణ సమయమున కాశీక్షేత్రమునందే నివసించి మరణించవలయుననే అభిలాషయు అనేకులకు గలదు. ఈ ఉద్దేశముతో రాజులు, మహారాజులు, ధనసంపత్తిగల మరి అనేకులు ఈ కాశీక్షేత్రమున స్వగృహములను నిర్మించుకొని నివసించుచుండిరి. ధర్మాత్ములు ధర్మశాలలను కట్టించి యాత్రకులకును మహోపకారమును చేయుచుండిరి. సామాన్యులు కూడ వయసుచెల్లిన పిమ్మట వారణాశియందు మరణించి ముక్తి నొందవలయుననే కోరికతో ఇండ్లను బాడుగకు తీసుకొని నివసించుచుండిరి. వీరికి కాలమాసన్నమగు వరకు గంగాస్నానము చేయుచు, విశ్వేశ్వరుని దర్శించు కొనుచు, కాలమునకు యెదురు చూచుకొనుచుండిరి. కాశీయాత్ర చేయుటకు రైలు సౌకర్యములు లేనికాలమున అనేకులు తమ ఆస్తులను గురించి తగుయేర్పాటులనుచేసి బంధువులకును ఊరివార్లకును అప్పగింతలుచెప్పి, కాశీకి ప్రయాణమవుచుండిరి. కాశీయాత్రానంతరము తిరుగ ఇంటికి వచ్చుట సందేహముగ నెంచుచుండిరి. స్వగ్రామమును వదలి దోవలోయుండు ప్రతి గ్రామమున బసచేయుచు పాదచారులై పోవుచుండిరి. ఆ కాలమున కాశీకి పోవువారిని ఆదరించి అన్నమిడుచుండిన వారుండిరి. వారిని చాలా గౌరవముగ

చూచుచుండిరి. యాత్రకు పోవువారు భార్యభర్తలయిన ఆదంపతులను ఆదరించి పూజించి పంపుచుండిరి. కాశీయాత్రకు పోయినవారు యాత్రను ముగించుకొని తిరిగిరాగలిగినవారిని చూచి భక్తిపూర్వకమైన ఆదరణతో వార్లకు అతిధ్యమిచ్చి సంతృప్తులగుచుండిరి. తిరిగి వచ్చినవారు కాశికావడిని కట్టుకొని అందులో గంగాచెంబులను, సాలగ్రామములను, శంఖములను, రుద్రాక్షదండలను, స్ఫటికములను పెట్టుకొని, దానిని మోసుకొనుచు వచ్చుచుండిరి. వీటిని చూచుటకు అనేకులువచ్చి వారిని దర్శించినప్పుడు వాటి మహాత్మ్యములను చెప్పుట విని సంతసించుచుండిరి. నాచేతయుండిన ఈ కొయ్యకూడ కాశినుండి తెచ్చితినని చెప్పునప్పుడందరు అకొయ్యను తాకి సంతృప్తిపడేవారు. మరికొందరు వార్లను తాకిన కాశీకిపోయిన ఫలము కలుగునని వార్లకాళ్లను తాకి మ్రొక్కుచుండిరి. పండితులుగ నుండిన పాద పూజ చేసి భోజనమిడి విశ్వేశ్వర ప్రసాదమును స్వీకరించుచుండిరి. అప్పటి నుండి వారిని కాశీవాసులని, ఆమెను అన్నపూర్ణాదేవియని అందరు పిలుచుచు అతిపవిత్రతగ వార్లను గౌరవించుచుండిరి. వీరుచెప్పు కాశీమజిలీల కథలను కాశీలోని వింతలు విశేషాలను శ్రద్దగ వినుచుండిరి.

ఈ కాశీవాసులు ఇల్లుచేరిన వెంటనే కాశీ సమారాధన చేయు ఉద్దేశముతో భోజన పధార్ధములను సేకరించుకొని బంధుమిత్రాదులను ఆహ్వానించి సుముహుర్తమున సంతర్పణను జరుపుచుండిరి.

ఆ సంతర్పణ సమయమున కాశినుండి తెచ్చిన గంగాతీర్థమును కాశివాసులు పురుషులకును, అన్నపూర్ణాదేవి స్త్రీలకును పంచుచుండిరి. భోక్తలు జాస్తిగనుండిన గంగాతీర్థమున మరికొంత గంగను కలిపి పంచుచుండిరి. భోజనమునకు వచ్చినవారి యిండ్లలో వ్యాధిగ్రస్తులు ముసలివారు నుండిన వార్లకు యిచ్చుటకు ఈ గంగను తీసుకపోవుచుండిరి. ఊరిలో యెవరైనను చావుకు సిద్ధమైనప్పుడు గంగాతీర్ధమును తీసుకొనిపోయి తులసిదళముతోకూడ వారి కంఠమున జారవిడిచెదరు. కొందరి యిండ్లలో యుండు దేవతార్చన పీఠమున గంగ చెంబులు తరతరములుగనున్నవి. ఆ చెంబులో గంగయుండినను లేకపోయినను పూజించుచు ఈ చెంబులు మా ముత్తాత, ముత్తవ్వ గారు తెచ్చినవని చెప్పుకొనుచుందురు. కొందరి యిండ్లలో సాలగ్రామములు, స్ఫటికములు, శంఖములు వగైరాలు చాల పురాతనముగనున్నవి. వాటిని చూచినప్పుడు పెద్దలు జ్ఞాపకమునకు వచ్చుచుందురు. కొందరు ముసలివారి చేతులలో తిరుగుచుండు రుద్రాక్షమాల మహాత్మ్యమును హెచ్చుగ చెప్పుచుందురు. ఈ రుద్రాక్షమాల పంచముఖీ రుద్రాక్షమాల అనియు, ఈ మాలను మా ముత్తాత

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షిప్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యటం
పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా పలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జూలై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి.**

కాశిలో చదువుచున్నప్పుడు మహానీయుడగు యొకసన్యాసి యిచ్చినదనియు చెప్పు చుందురు. సాలగ్రామములకు, శంఖములకు, స్ఫటికములకు వేరు వేరు మాహాత్మ్యములను చెప్పుచుండిరి.

## కాశీ మాహాత్మ్యం

ఇంకను సర్వశాస్త్ర పారంగతులు, ప్రాచీనులునగు మహాత్ములు, మత స్థాపకులు, పండితోత్తములు అందరు ఇక్కడనే ప్రసిద్ధిచెందిన పురుషులని లోక ప్రసిద్ధము. బుద్ధభగవానుడు లోకోత్తరమగు బౌద్ధమతమును ఇక్కడినుండియే ప్రపంచమునకు ప్రసాదించినది. అద్వైత మతస్థాపకులగు శ్రీశంకరాచార్యులు కాశీక్షేత్రముననే హిందూమతమును ఉద్ధరించినది. వీరశైవులకు స్మార్తులకు శివభక్తి ప్రదమైన శైవమతమును విశ్వనాథస్వామి ఇక్కడ నుండియే వేల సంవత్సరములకు ముందు ప్రసరింప చేసినట్లు చెప్పుకొనెదరు. వీరవైష్ణవులకు శ్రీబిందు మాధవస్వామి క్షేత్రము మరి అనేక విష్ణుక్షేత్రములు ఇక్కడ స్థాపింప బడియున్నవి. మధ్వమతస్థులకు శ్రీ హనుమంతుని దేవాలయములు యిక్కడ గలవు. మహమ్మదీయులకు కూడ ఇక్కడ గొప్ప మసీదులు గలవు. గంగా తీరమున విశ్వనాథస్వామి సన్నిధికి సమీపముననే గొప్ప మసీదు గలదు. ఈ విధముగ ఈ కాశీక్షేత్రమున అన్ని మతములవారుకూడి భజించుటకు తగిన వేరు వేరు దేవాలయములుగలవు.

'విశ్వేశ్వరం మాధవంఢుండిం దండపాణించ భైరవం
వందేకాశీంగుహాం గంగాం భవానీం మణికర్ణికాం'

అని ఇక్కడి విశేషములు పెద్దలచే కీర్తింపబడినవి.

మూడుకోట్ల శివలింగములమధ్య కోటిసూర్యప్రభ వలె ప్రకాశించుచున్న ఈ కాశీపట్టణమున మానవుడు ఒక మూహూర్తకాలమైనను నివసించి విశ్వనాథుని దర్శించిన వారికి మరుజన్మ లేకుండునని ప్రాజ్ఞులు వచింతురు. అట్టి కాశీ క్షేత్రముయొక్క మాహాత్మ్యమును నేను వినుచుంటిని. చదువుచుంటిని.

నా జన్మసాఫల్యమునకు గంగాస్నానమొనర్చి రామకృష్ణాది మహానీయుల పాదధూళి సోకిన అయోధ్య, మధుర, బృందావనం, గోకులం మొదలగు పురాతనపు పుణ్య క్షేత్రములను దర్శించి రావలయుననే కోరిక నాకు చిర కాలముగ నుండెను - కోరిక అంత సులభమైనది కాదుగనుక కొంతము కాలము వేచియుండవలసి వచ్చినది.



దక్షిణ మద్రాసు నుంచి రెండవసారి లోక్‌సభకు
ఎన్నికైన వైజయంతీమాల బాలి

# గంగాస్నానం

మరునాడు ప్రాతఃకాలముననే గంగాస్నానమునకు బయలుదేరితిమి. విశాలాక్షి ఘట్టమునుండి మణికర్ణికా ఘట్టమున కుసుమారు ముక్కాలు మైలు న్నది. అక్కడికి గంగవడ్డుననే నడిచిపోవలయును. మార్గమున యుండిన ఘట్టములలో అనేకులు స్నానమును చేయుచుండిరి. కాశీలో స్థిరవాసముగ నుండువారు ప్రతిదినము మణికర్ణికా ఘట్టములో స్నానముచేయు ఆచారములేదు.

పర్వదినములలో మాత్రమే ఈ మణికర్ణికా ఘట్టమున స్నానమును చేయుదురు. మణికర్ణికా ఘట్టమునందు స్నానముచేయు యాత్రికులు అధికముగ నుండుట వలన ఊరివారందరు ఇతర ఘట్టములలో స్నానముచేసి విశ్వనాధుని దర్శించి ఇండ్లకు పోయెదరు. మేము నడుచుచుండు మార్గమున పోవువారు కొందరు 'రాం, రాం', 'హరే, హరే' యని ధ్యానమును చేయుచు పోవుచుండిరి. మరికొందరు తమ సొత్తులను మూటకట్టుకొని తలమీద పెట్టుకొని 'శివ, శివ' యనుచు స్నాన ఘట్టమునకు నడుచుచుండిరి. కొందరు యువకులు, యువతులు చేతులు పట్టుకొని స్నానమునకు పోవుచుండిరి. బాల బాలికలును పరుగిడుచు గంగవైపునకు పోవుచుండిరి. తాతలు అవ్వలు కఱ్ఱల నాధారము చేసుకొని తిన్నగ నడుచుచుండిరి. గ్రుడ్డివారు కుంటివారు ఇతరుల సహాయముతో గంగాస్నానమునకు వెళ్లుట చూచితిని. రెండుకాళ్లు లేనివారిని వీపుమీద యెక్కించుకొని పోవుచుండిరి. అనేక దినములు తల్లిని చూడకయుండి, తల్లి కనుపడిన వెంటనే బిడ్డ యేవిధమైన ఆతురతతో తల్లిని సమీపించుటకు పరుగెత్తునో, అటులనే జనులు గంగాభవానిని సమీపించుటకు పరుగెత్తుచుండిరి.

భిక్షకులు 'బాబూ ! ఏక్ పైసాదేవ్' అని యాచించుచుండిరేగాని వారు మన వెంటపడి మనలను బాధించరు. వీరుండిన స్థలమునుండి కదలరు.

మేము మణికర్ణికా ఘట్టమునకు చేరుసరికి 10 గంటలయినది. మమ్ములను వెంబడించిన పురోహితుని ఆజ్ఞప్రకారము అక్కడ చేయవలసిన స్నానాది కర్మకాండ నంతయు ముగించుకొంటిమి. అది డిశంబరు మాసమగుటచే విపరీతమైన చలిగనుండెను. గంగాస్నానము చేసి గట్టునకు వచ్చులోపలనే కాయము కట్టెవలె మారినది. ఆ గంగ గట్టున కొందరు సన్యాసులు చలిమంటలను వేసుకొనుచుండిరి. స్నానము చేసినవారు చలికి తాళలేక ఆ మంటలచుట్టు కూర్చుని చలికాచుకొనుట చూచి మేమును అక్కడ చేరితిమి. కొంతసేపు అక్కడ కూర్చుని సన్యాసులకు తల ఒకకాని యిచ్చి బయలుదేరి విశ్వేశ్వరుని దేవాలయము ప్రవేశించితిమి.

దేవాలయముననుండు భిక్షకులకుగాను అక్కడ కొన్ని నాణ్యములను అమ్మెదరు. అవి అణాకు యెనిమిది. ఒక రూపాయికి ఆ నాణ్యములను తీసుకొని లోపల ప్రవేసించితిమి. దోవలో ఇరుప్రక్కలను కూర్చుని యాచించు యాచకులకు కాసుల నిచ్చుచు లోపలికి సులభముగ పోతిమి. ఈ భిక్షకులలో చాలమంది వయసుచెల్లిన వారే యుండిరి. ఈ ప్రకారము భిక్షమెత్తి దినములను గడిపి కడపట ఈ కాశీక్షేత్రముననే మరణించవలయుననే కోరికతో వీరుండినట్లు నాకు తోచినది. అనేకులు ఈశ్వర ధ్యానమును చేయుచు తిరుగుచు, అక్కడక్కడ మరణించువారిని గంగాతీరమునకాల్చి, గంగాభవానికి అప్పగించుటకు యేర్పడిన ఒక సేవాసమితి, ఇక్కడగలదు. 'అనాధ ప్రేత సంస్కారాత్ కోటి యజ్ఞఫలం లభేత్' అను వచనమును సార్ధకపరచుటకు కొందరు ధర్మాత్ములు ఈ సమాజమును స్థాపించిరి.

ఇక్కడి భిక్షకులు సన్మార్గులని నాకు తోచినది. భిక్షమెత్తిన ద్రవ్యమును కల్లంగడిలో ఖర్చుపెట్టువారు కాదని నాకు స్పష్టమైనది. అందువలన వీరికిచ్చు దానము సత్పాత్రయందుంచినాను - అనే మనశ్శాంతి గల్గినది. అందువలనే "పాత్రమెరిగి దానం గోత్రమెరిగి వివాహము" చేయుమని పెద్దలు చెప్పిరి.

## విశ్వానాధుని క్షేత్రము

కాశీనగరము ఆదిలో ఒక మట్టిదిబ్బగ నుండినట్లును, విశ్వనాధస్వామి బ్రహ్మాహత్యకు భయపడి, ఈప్రదేశమున వెలిసినట్లును స్థళపురాణము గలదు. మొదట ఇక్కడ ఉండినది శ్రీఆదినారాయణుడని ప్రమాణము గలదు. ఈనగర ప్రకృతి అకృతి అసహ్యముగను, గజిబిజిగను కనుపించును. సందుగొందుల కలిగిన మార్గములను కలిగియుండును. మూడునాలుగు అంతస్థుల మేడలను గలిగి సూర్యకిరణముల కడ్డుపడుచుండును. ఇందువలన పట్టణము పరిశుభ్రముగ నుండదు. ఈ అపరిశుభ్రమైన సందుగొందులలో నుండి విశ్వనాధ క్షేత్రమునకు పోవుమార్గముండెను. ఈమార్గమధ్యమున గొప్ప గోమాతలు విచ్చలవిడిగ సంచరించుచుండెను. వాటిని చూచినప్పుడు మనకు భయముగ నుండినను అవి మనజోలికి రావు. వాటిని యాత్రికులు మేపుట వలన బలిసి తిరుగుచుండును.

ఈ విశ్వనాధ క్షేత్రము చెప్పతగినంత ఆడంబరముగ లేదు. అయితే ఆ దేవాలయమును ప్రవేశించగనే మానవుని మనస్సునకు కలుగు ఆనందమును చెప్పనలవికానిది.

(ఇంకావుంది

# డైరీ

1989 అక్టోబరు 12

లిఖిత చరిత్రకు పూర్వం నుంచీ బెరింగ్ జలసంధి మధ్యనున్న మెట్ట మీదుగా (ఇప్పుడా లాండ్ బ్రిడ్జి మునిగి పోయింది) అమెరికా ఖండంలోకి అన్యదేశీయులు వలస వెళ్తూండేవారు. 1620 నాటి 'మేఫ్లవర్' ఓడలో 'పిల్‌గ్రిమ్ ఫాదర్స్' అక్కడికి చేరుకున్నారు. 1776 జులైలో అమెరికాలోని పదమూడు రాష్ట్రాలూ, పితృదేశమైన బ్రిటన్‌నుంచి విడిపోయాయి. అనేకానేక మతసంప్రదాయాలను, జీవన సరళిని తనలో జీర్ణించుకుంటూ, ఆ సమ్మిశ్రమం నుంచి తనదైన ఒక ప్రత్యేక సంస్కృతికి రూపునిస్తోంది అమెరికన్ ప్రజావాహిని. వలసవెళ్లే వారు సాధారణంగా ముప్ఫయ్యయిదు సంవత్సరాలలోపు వారై ఉంటారు. వారికి తమఊరు, స్వజనం, స్వదేశం పై కాస్త మమకారం వుండవచ్చు - ఎంచేతనంటే, తమ స్మృతిపేటికలోనివి వారు చెరపలేరు. ఆ మొదటి జనరేషన్ కాస్త వూగిసలాడటం సర్వసామాన్యం. రెండవ జనరేషన్, అంటే వారక్కడికి వెళ్లాక కలిగిన సంతానానికి, తలిదండ్రుల దేశంపట్ల అభిమానం ఉండగల అవకాశం తక్కువ. వారు అమెరికన్ సంస్కృతికి వారసులు. అమెరికన్ సంస్కృతి అంటే ఏమిటి? అనే ప్రశ్న కలగవచ్చు. అదొక 'మెల్టింగ్ పాట్' - కావల్సినవి తీసుకుంటూ, అక్కర్లేనివి వొదిలేస్తూ, సలసలకాగే పాత్ర; నిరంతరశ్రమతో, నిత్యనూతన జీవలక్షణంతో ప్రజారథాన్ని చైతన్యవంతం గావించే సంస్కృతి అది .. ఫిలిమ్‌వరల్డే తీసుకోండి - చార్లీచాప్లిన్, గ్రేటాగార్బో, విలియమ్ వైలర్ - యిలా ఎందరెందరో అకాడమీ విజేతలు, బయటదేశాల నుంచి వచ్చి, యిక్కడ స్థిరపడి, ఈ సంస్కృతీ వాహినిలో కలిసిపోయినవారే ... 'ది ఇమిగ్రెంట్ ఎక్స్‌పీరియన్స్' (The Immigrant Experience )అనేపేరుతో, వివిధదేశాల నుంచివచ్చి, అమెరికాలో స్థిరపడి, తమ వ్యక్తిలక్షణం కాపాడుకుంటూనే, అక్కడి జీవన విధానంలో కలిసిపోయే ప్రయత్నం లోని అంతర్వేదన చిత్రిస్తూ, ఏడు చిత్రాల ఫెస్టివల్ ఏర్పాటు చేశారు అమెరికన్ సెంటరులో ! ఇవ్వాళ చూసి

నది 'ది ఛొజెన్' (The Chosen — 108 m)... బంతిఆటలో బద్ధవిరోధులైన యిరువురు యూదుయువకులు - యిద్దరూ విభిన్నమైన వాతావరణంలో పెరిగినవారు - హాస్పిటల్‌లో సన్నిహితులై, మానవతా సూత్రాలతో బంధింపబడతారు. రూవెన్ తండ్రి సగటు అమెరికన్; డానీ తండ్రి యూదు సంప్రదాయాలకు కట్టుబడ్డ మతగురువు. ఈ మతగురువుకి తన కొడుకు, కాలంతో కొట్టుకుపోవటం యిష్టం ఉండదు. కాగా, యిద్దరు యువకులదీ పరస్పర గౌరవమూ, మన్నన, అవగాహనగల స్నేహ సూత్రం. రెండవ ప్రపంచ యుద్ధానంతరం, ఇజ్రేల్ అవతరణతో, డానీదీ, రూవెన్‌దీ వెరోదారి అయినప్పటికీ, వారి స్నేహంమాత్రం వాడదు. ఛైయిమ్ పొటొక్ (Chaim Potok) యిదేపేరుతో వ్రాసిన నవలకు చిత్రీకరణ. దర్శకులు : జెరిమి పాల్‌కిగాన్.

..... 19

ఫెస్టివల్‌లోని ఏడు చిత్రాలూ చూదామని ఆశపడ్డాను గాని సాధ్యం కాలేదు. ఇవ్వాళ 'బీన్‌ఫీల్డ్‌వార్' (The Melagro Beanfield War 115 m) రసవత్తరంగా, మన పరిస్థితులకి కనువిప్పుగా ఉంది .... ఇటాలియన్, స్పానిష్, మెక్సికన్ సంప్రదాయాలు కలగాపులగంగా గల ఒక కొండ గ్రామంలోని చిక్కుడు తోటలకు నీరు వుండదు. కొండ నాను కొని పెద్ద హొటల్ కట్టించనున్న ధనాధిపతి ఆ చుట్టుపట్ల భూమి అంతా తాము నిధి నిక్షేపాలతోను, జలాశయాలతోను కొనేశామనీ, అంతగా అయితే ఆ ఊరు ఖాళీచేసి మరొక ఊరు వెళ్లిపొమ్మని, కావాలంటే కాంపన్సేషన్ యిస్తాననీ తన మనుషుల ద్వారా కబురు పెడతాడు. 'మూడు వందల ఏళ్లుగా, మా తాతముత్తాతల కాలం నుంచీ ఈ ఊళ్లో ఉంటున్న మమ్మల్ని ఖాళీచేయమనేందుకు ఈయనెవరు? ఆయనకు కోట్లు వుంటే మాకేం? దిక్కున్న చోట చెప్పుకోమను- మేము ఖాళీచేయము. మా పంట పొలాలకంటె ఈయన వినోదకేంద్రం ముఖ్యమా?' అని దూకుడుగా ఎదురు తిరుగుతుంది - పాతికేళ్ల జర్నలిస్ట్ యువతి .... ధనబలం, ప్రజాబలం - ఎటూ చెప్పలేని పోలీసు అధికారి! కాలవనీరుతో చిక్కుడు తోట పండించడం బలా బలాల పరీక్ష అవుతుంది. బుల్‌డోజర్‌తో పంట ధ్వంసం చేయాలని ప్రతికక్షులు ప్రయత్నించగా, ఆ ప్రయత్నాన్ని వమ్ము జేస్తారు తుపాకులు చేత ధరించి వచ్చిన ఊరి పెద్దలు. రక్తపాతాన్ని ఆపవలసిన షెరీఫ్ కోర్టు ఉత్తరువుతో ప్రత్యక్షమై, ప్రజలను శాంతింప జేస్తాడు; కోటీశ్వరుడు పలాయనం చిత్తగిస్తాడు .... ఎంత పెద్ద పర్యాటక కేంద్రం తలపెట్టినా, స్థానిక ప్రజలు నష్టపోకూడదు; వారి సహజ వనరులకు యిబ్బంది కలగ కూడదు .... దర్శకత్వం : రాబర్ట్ రెడ్‌ఫోర్డ్

బుచ్చిరెడ్డి పాలెం వాస్తవ్యులు మెన కూరు. శ్రీనివాసులు రెడ్డి, శ్రీదేవమ్మ దంపతుల కుమారుడు చి॥ చంద్ర శేఖరరెడ్డికి, హైదరాబాదు - కొండా సుబ్బారెడ్డి దంపతుల కుమార్తె సౌ॥ సంప్రీతి లక్ష్మికి, వి జ య రా ణీ మహల్‌లో ఈ సాయింత్రం ఎనిమిది న్నరకి శాస్త్రోక్తంగా వివాహం జరి గింది. బంధు మిత్రులనేకులు వచ్చి, నూతన వధూవరులను ఆశీర్వదిం చారు. నవదంపతులకు మా శుభాభి నందనలు.

. . . . . 22

'మనసుని ద్రవీభూతం చేస్తూ ప్రేక్షకులకు కన్నీరు తెప్పించే పాట లెన్నో రాసిన ఆత్రేయిది పసి హృద యం. ఆ పసితనమే ఆయన పాటకు పసిడిదన మిచ్చింది' - అన్నారు కె రామలక్ష్మి, పొట్టిశ్రీరాములు హాటలో 'అభ్యుదయ రచయితల' సాహిత్య గోష్ఠి సందర్భంగా. ఆత్రేయ రచనలపై పరిశోధన జరుపుతున్న 'పైడిపాల' ఆత్రేయ నాటక రంగ ప్రవేశమూ, జీవన పోరాటమూ, సినీక్షేత్రమూ, అభ్యుదయ దృక్పథానికి కట్టుబడిన ఆయన రచనా పద్ధతి మున్నగు విష యాల గురించి ప్రసంగించారు. ....

. . . . . 23

పదహారో తేదీన ఉదయం ఏడుం పావుకి టెలిఫోనులో 'నేను పాపనండి







- మాలతిగారితో మాట్లాడాలి' - అన్నారు ఒకామె - అవతల కొస నుంచి, 'నేను ఫలానా.... ఏ పాప ? మద్రాసు నుంచా ?' అని ప్రశ్నించాను. 'మద్రాసు నుంచి కాదండీ, హైదరాబాదు నుంచి. పాప అంటే ఆమెకి తెలుస్తుంది' - అన్నారామె. మిసెస్ కొండలరావు, పాపగా మాకు, ముప్ఫయ్యేళ్ల పరిచయం. ఆమె కంఠంలా లేదు గాని సందేహ నివృత్తికోసం 'మిసెస్ కొండలరావా ?' అని అడిగాను. 'కాదండి, కలెక్టరుగారి పాపను - ఆమెకి తెలుసు' అన్నారు. ఈ కలెక్టరుగారి పాప గురించి మాలతి ఎప్పుడూ అనలేదు - ఆ ప్రస్తావన రాలేదు.... 'సరి, విషయమేమిటో చెప్పండి - ఆమె మేడమీద ఉన్నారు, ఇంటర్‌కమ్‌లో ఆమెని పిలవబోయే ముందు, విషయమేమిటో తెలుసుకోవాలి కద !' - అన్నాను. అప్పటికామె కాస్త దార్లోకి వచ్చారు. 'రవీంద్ర భారతిలో 24వ తేదీన నా మ్యూజిక్ ప్రోగ్రామ్ - మాలతిగారిని ముఖ్య అతిధిగా పిలవాలని. వెనకొకసారి అడిగితే వస్తానన్నారు' - అన్నారు అవతల వైపునుంచి. 'ఎప్పుడడిగారు ? ఎక్కడ అడిగారు ?' - అని ప్రశ్న. 'నల్లకుంటలో సీతాబాయి గారింట్లో! నాపాట కూడా విన్నారు మాలతిగారు'.... అప్పటికి కొంచెంగా బోధపడింది. సీతాబాయి అంటే హైదరాబాదులో ఉన్న మాలతి అక్కగారు. ఈ కలెక్టరు గారి పాప పాటని అక్కడ విన్నదన్న మాట.... 'వస్తానని ఆమె అని వుండవచ్చు. కాని, మేము రావడమంటే మీకు రెండువేలు ఖర్చు. మాకు టికెట్ రాను పోను పదిహేనువందలు. అక్కడ రెండు రోజులకీ నాలుగైదు వందలు, హొటల్ ఛార్జీలూ అవీ అవుతాయి. మీ అరేంజర్స్‌కి అంత ఖర్చు అంగీకారమౌనో కాదో....' .... 'అదేమిటండీ, మిమ్మల్ని పిలుస్తున్నప్పుడు, మీ ఖర్చుపెట్టుకు రమ్మంటామా ? మీ వసతి సౌకర్యాలు చూడటం మా బాధ్యత....' ఇంతలో కట్ అయింది - మళ్లీ మోగింది. .... 'నేను కృష్ణమూర్తినండీ - ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంటులో సూపరెంట్ ఇంజనీరుని.... మీకు రెండువేలు కాదు, రెండువేల అయిదువందలు డ్రాఫ్ట్ ఇవ్వాళే పంపిస్తున్నాము - ఫ్లయిట్‌లో రండి, 'కృష్ణ ఓబిరాయ్' మీకు బుక్ చేయిస్తాను' అన్నారు. 'కృష్ణా ఓబిరాయ్ వద్దు - నారాయణగూడా టాజ్‌లో నాగరాజారావుకి చెప్పండి. ఫ్లయిట్‌లో రావలసినంత తొందరేమీ లేదు - మీ చేత యింకో వెయ్యి రూపాయిలు ఎక్కువ ఖర్చు పెట్టించడం మాకు యిష్టం లేదు,' అన్నాను. అడ్రస్ అడిగారు - ఇచ్చాను. 'హైదరాబాదు నుంచి కలెక్టరుగారి పాపట. 24 న రవీంద్రభారతిలో - డ్రాఫ్ట్ ఇవ్వాళ పంపుతున్నామన్నారు' అని మాలతిని ఇంటర్‌కమ్‌లో బ్రీఫ్ చేసి, కనెక్షన్ పైకి ఇచ్చాను : బ్రేక్‌ఫాస్ట్‌కి మేడ మీదకి వెళ్లినప్పుడు మిగతా వివరాలు చెప్పాను.... పదహారున డ్రాఫ్ట్ పోస్ట్‌చేస్తే 18 లేక 19కి

ఖచ్చితంగా వస్తుంది. 20వ తేదీన కూడా రాకపోయేసరికి వారు విరమించుకున్నారనుకున్నాము. బరంపురం నుంచి, బళ్లారి దాకా ఇటువంటి పిలుపులు కొత్తకాదు; ఖర్చు విషయం, వచ్చేసరికి వెనకాడటం మామూలే గనక, డ్రాఫ్ట్ వచ్చేదాకా వీటిని సీరియస్‌గా తీసుకోవడం ఎప్పుడో మానేశాము.... మమ్మల్ని పిలిచిన వారి టెలిఫోను నెంబరేమిటో, యడ్రసేమిటో ఏమీతెలియదు; సోమవారం ఉదయం టెలిఫోన్ సంభాషణ తప్ప వారిగురించి ఏమీ తెలియదు. ఆ పాప పేరేమిటో తెలియదు; కృష్ణమూర్తిగారి యడ్రసేమిటో తెలియదు. 21 ఉదయం పోస్ట్‌లో కూడా ఎటువంటి ఉత్తరమూ రాలేదు. శనివారం (21) సాయింత్రం నాలుగున్నరకి లారెన్స్ (ఆఫీసు అమ్మాయి) పోస్ట్ బాక్స్ క్లియర్ చేస్తూ, నాలుగు పత్రికలూ ఒక పొడుగు కవరూ పట్టుకొచ్చింది. విద్యుత్ భవన బ్రవున్ కవర్‌లో 'డివైన్ లైఫ్ సొసైటీ' లెటర్ హెడ్ మీద రామారావుగారి లేఖ - రెండు వేల బాంక్ డ్రాఫ్ట్.... పంక్షన్‌కి మానేసి, సెంట్రల్‌కి వెళ్లాను; సోమవారం సాయింత్రం ఛార్మినార్ ఎసి స్లీపరులో వెయిటింగ్ లిస్ట్ మూడు, నాలుగు, 'బెర్తులు వుంటాయి, సార్' అని ధైర్యం చెప్పాడు కౌంటర్‌లోని వ్యక్తి.... మధ్యాహ్నం మూడుగంటలకి రామారావుగారు ఫోను చేసి, మర్నాడు ఉదయం సికింద్రాబాదులో కృష్ణమూర్తిగారూ, లక్ష్మిగారు మమ్మల్ని రిసీవ్ చేసుకుంటారని చెప్పారు. అప్పటికి తెలిసింది - పాప' అసలు పేరు 'లక్ష్మి' అని. చార్మినార్‌లో మాకు బెర్తులిచ్చాక కూడా అయిదారు ఇంకా ఖాళీగా ఉన్నాయి

. . . . 24

ఆనవాయితీ తప్పకుండా గంట న్నర లేటుగా వచ్చింది ఛార్‌మినార్. స్టేషన్‌కి వచ్చారు కృష్ణమూర్తి, లక్ష్మి. పరస్పర పలకరింపులూ, మర్యాదలూ అయాక, 'మీకు విద్యుత్ భవన్ గెస్ట్ హౌవుజ్‌లో బస ఏర్పాటు చేశాం. ఎలక్షన్ టికెట్లకోసం వచ్చిన వారితో హొటళ్లన్నీ కిక్కిరిసి వున్నాయి - ఎక్కడా కాళీలేదు. రేపు సాయింత్రం మీరు ట్రయిన్ ఎక్కేదాకా ఈ కారు మీవద్దనే ఉంటుంది మీరు వాడు కొనేందుకు' అన్నారు కృష్ణమూర్తి. ట్రాన్స్‌పోర్ట్ ప్రాబ్లెమ్ తీరింది. గెస్ట్ హౌవుజ్‌లో యకామడేషన్ ఏర్పాటు చేశారు; సాయింత్రం ఆరుగంటలకి రవీంద్ర భారతిలో ఫంక్షన్! ఇంతకీ ఏమిటా ఫంక్షన్? ఎవరెవరు పాల్గొంటున్నారు? ఇంత ఖర్చుపెట్టి మమ్మల్నెందుకు పిలిపించినట్లు? గెస్ట్ హౌవుజ్‌లో కూచున్న అరగంటకిగాని ఈ ప్రశ్నలకు సమాధానం లభించ లేదు. మాలతీచందూర్ రచనల వల్ల, వారం వారం జవాబులవల్ల తాము ఎలా ప్రభావితులవుతున్నదీ మెచ్చు కోవడమయాక, అసలు కథలోకి వచ్చారు. నలుగురు పిల్లల తల్లి లక్ష్మి - అందులో యిద్దరి ఆరోగ్యం అంతంత మాత్రం - భర్త ఉద్యోగరీత్యా జడ్ చర్లలో ఉంటున్నారు - తను తమ స్వంత ఊరు ఖమ్మంలో మకాం - ప్రస్తుతం 'లా' చదువుతున్నారు - చిన్నప్పట్నుంచీ సంగీతాభిరుచి - అన్నమాచార్య సంకీర్తన మన శ్శాంతి నిస్తున్నది - ఇంతవరకూ ఆలయాలలోను, ప్రార్థన మందిరాల లోను మాత్రమే పాడారట - ఇది నూరవది - మొట్టమొదటి పబ్లిక్ కాన్సర్ట్. ఈ పెర్‌ఫారమెన్స్‌కి మాలతీచందూర్ ముఖ్య అతిధిగా రావాలనీ, తనని ఆశీర్వదించాలనీ ఆమె చిరకాల వాంఛితమట. అంత గాఢమైన కోరికకు కారణం? పది హేను సంవత్సరాల క్రితం ఆమె మా ఇంటి కొచ్చిందట. ప్రసంగ వశాన మాలతి 'రాయవెల్లూరులోని డాక్టర్ మేరీ వర్గీస్‌కి మీ అబ్బాయిని చూపించ కూడదా?' అన్నదట - ఆ బాలుని అంగవైకల్యానికి తల్లి బాధపడు తూండగా! (డాక్టర్ మేరీ వర్గీస్ ఆత్మ కథ (Take My Hands), లక్నో పబ్లిషింగ్ హౌస్ వారికోసం, తెలుగు లోకి అనువదించాను. తనకి డిక్టేట్ చేశానో, కాపీ చేసిందో గుర్తులేదు. కాని, ఆ పుస్తకం మాయిద్దరినీ ఎంతో కదిలించింది. రెండు సంవత్సరాలు బెడ్‌మీదవుండి, ఆత్మబలంతో అవిటి తనాన్ని ఎదుర్కొని, కాళ్లమీద నిల బడటమనే ప్రశ్న లేకపోయినప్పటికీ, ప్రభువు తనని కరుణించి యిచ్చిన హస్తాలతో అత్యద్భుతమగు సర్జరీ నిర్వహించిన ఆమె జీవితగాధ ఒక మార్గజ్యోతి. అటువంటి పుణ్యజీవనుల చరిత్రం చదివినమీదట మన చుట్టూ గల సోమర్శులని చూస్తే చిరాకు పుడు తుంది.... తెలుగులో ఆ పుస్తకం పది వేలో, పదిహేనువేలో అచ్చువేశారట.

అమ్మించారో, పంచిపెట్టారో తెలీదు. నా 'ట్రాన్స్‌లేషన్ ఫీ' పదిహేను రోజులలో వచ్చేసింది. కాని, తెలుగు పుస్తకాన్ని మాత్రం యింతదాకా నేను చూడలేదు. Take My Hands తెలుగులో తాము చదివామనీ, కాపీ పంపుతామనీ గుంటూరునుంచి ఒకరు, విశాఖనుంచి ఒకరు చెప్పారు. కాని, వారూ పంపలేకపోయారు. తెలుగు పుస్తకం నేను చూస్తేనేమి, చూడకపోతేనేమి - కొన్ని వేలమంది ఆ మహనీయురాలి అద్భుత గాథ చదివారు. అంతకు మించి ఏ రచయితకైనా కావలసిందేముంటుంది?).... ఈ లక్ష్మి, మేరీ వర్గీస్ వద్దకు తన కుమారుని తీసుకు వెళ్లింది. ఆ డాక్టరు గారి అనునయ వాక్యాలు నూతనోత్సాహాన్ని కలిగించాయి. ఆ అబ్బాయికి, ఆ అబ్బాయి తమ్మునికి కూడా వైద్యం చేయించింది. ఆమె సలహా మేరకు బొంబయి 'జస్‌లోక్'లో కూడా చూపించిందట. నలుగురు పిల్లలతో ఒక్కడు తప్ప మిగతా ముగ్గురూ ఆరోగ్యంగా ఉన్నారు. వెయ్యి న్నూట పదహారు సార్లు వేదిక మీద నుంచి దివ్యనామ సంకీర్తన చేయాలని ఆమె సంకల్పం. ఈ విధమైన భగవత్సేవ ద్వారా కృతజ్ఞతాంజలి ఘటించాలని ఆమె అభీష్టం.... సాయంత్రం ఆరున్నరకి రవీంద్ర భారతిలో నారాయణమూర్తి - మృదంగం, దత్తా - ఫ్లూటు, సత్యవతి - వయొలిన్, లక్ష్మి - వీణ, కృష్ణమూర్తి - తంబురాతో, యస్ లక్ష్మి, అన్నమాచార్య కీర్తనలు భక్తి



పారవశ్యంతో పాడారు. 'కంటి అఖిలాండ కర్తను' వర్ణిస్తున్నప్పుడు, శ్రోతలందరినీ తమ వెంట తీసుకు వెళ్తున్న అనుభూతి కలిగించారు. డివైన్‌లైఫ్ సొసైటీ కార్యదర్శి రామారావు స్వాగతం పలికారు ; మాలతీ చందూర్ దీపారాధన గావించి, వియస్ లక్ష్మి సంకల్పం నెరవేరాలని శుభాకాంక్షలు తెలిపారు.... మర్నాడు కొందరు ఫ్రెండ్స్‌ని చూచి, మూడున్నరకి మద్రాసు ఎక్స్‌ప్రెస్ ఎక్కాము. లక్ష్మిగారు, కృష్ణమూర్తిగారు సికింద్రాబాదు దాకా మా కంపార్టుమెంటులో వచ్చి, వీడ్కోలు చెప్పారు. "ఇది మన మొదటి పరిచయం - యింకా ఎన్నిసార్లో కలుసుకో వలసివుంది' - అన్నారు కృష్ణమూర్తి గారు ఎంతో అభిమానంతో, ఆ ప్యా య త తో ! ఈయన విద్యుత్ శాఖ కృష్ణమూర్తి ; అటవీశాఖ కృష్ణమూర్తి సతిసమేతంగా నాగాలాండ్ పర్యటనలో ఉన్నారట. అంచేత 'నీలాపనిందలకు గురి అయిన యూకలిప్టస్ నిర్దోషి' అని ప్రామాణికంగా నిరూపించిన కృష్ణమూర్తి గారిని చూడలేకపోయాము.

. . . . . 27

కుంభవృష్టిగా వర్షం - ఆపరేషన్ పెసరట్ - ఉప్మాతో.... కళాసాగర్ వారి నూతన గృహ ప్రవేశం .... యండమూరి వీధినాటకం 'రుద్రవీణ'ని, విజయవాడ రాజారావు మెమోరియల్ ఆర్ట్ అకాడమీ తరఫున భాబూరావు పార్టీ ప్రదర్శించారు. చంద్రశేఖరం మేష్టారు పెన్షన్ ఉదంతానికి సంబంధించిన ఈ వీధి నాటకం, ప్రతి పక్ష, ప్రతీకార పక్షాల భేషకులతో, నక్కలూ గుడ్లగూబలూ చెప్పే కథగా బాగా రక్తి కట్టింది. మంత్రులలోని నక్క జిత్తులకీ, ఉద్యోగులలోని లంచగొండి తనానికీ యిదొక మచ్చుతునక.... కొత్తయింట్లో కర్పూరం వెలిగించి, కొబ్బరికాయ కొట్టాక, అంత వర్షంలోనూ విజయా గార్డెన్స్‌లోని సుమంత్ ప్రొడక్షన్స్ ముహూర్తానికి ! రాయపరాజు కుమారుడు సుధాకర్, కోడి రామకృష్ణ దర్శకత్వంలో వెంకటేష్ - విజయశాంతి హీరో హీరోయినులుగా నిర్మిస్తున్న చిత్రమిది. సత్యమూర్తి మాటలు, రాజ్‌కోటి సంగీతం పిక్చరుకింకా పేరు పెట్టలేదు - 1990 ఏప్రిల్‌లో విడుదల చేదామని అనుకుంటున్నారు .... సాయంత్రం అయిదు గంటలకి హోటల్ ప్రెసిడెంట్‌లో, బాబా ఫరీద్ మెమోరియల్ సొసైటీ, తమిళనాడు చాప్టర్ ఏర్పరుస్తున్న సందర్భంగా సమావేశం. నాగాలాండ్ గవర్నరు గోపాల్‌సింగ్ ఈ ఫంక్షన్‌కి వస్తారనుకున్నారుగాని సార్వత్రిక ఎన్నికల కారణంగా ఆయన రాలేకపోయారు.... 'ఈ మద్రాసు నగరానికి ఒక ప్రత్యేకమైన సాంస్కృతిక పరిమళం ఉంది. ఉత్తర భారతానికీ ఈ పట్నానికీ చాలా తేడా ! సగటు మద్రాసీ పౌరుడు సచ్ఛీలుడు, సజ్జనుడు అనడంలో ఎటువంటి సందేహమూ లేదు. గురునానక్ కాలేజీ మద్రాసు

పౌర జీవనంలో అంతర్భాగమై పోయింది. గురునానక్‌కి మూడు వందల సంవత్సరాలకి పూర్వం, 1173 లో ఫరీద్ అనే ముసల్మాన్ సూఫీ వేదాంతి బోధించిన మానవతా సూత్రాలూ, ప్రార్ధన గేయాలూ ఇప్ప టికీ పంజాబ్ ప్రజల జీవితంలో ప్రముఖస్థానం వహిస్తున్నాయి.... సేవా తత్పరత వల్ల మతం సజీవమై నిలుస్తుందిగాని శుష్క ఆచారాలు పాటించడంవల్ల ఎంత మాత్రం కాదు. అహింసని ఆత్మ గౌరవాన్ని మన్నించ లేనిది మతమే కాదు.... మృత్యువు ఒక వధువులాటిది - ఆ వధువు చేయి అందిచ్చేలోపునే చావకండి.... ఇస్లామ్ మతం పుచ్చుకోవడం దేనికి? మనో మాలిన్యం లేనినాడు ప్రతి మనమూ గొప్పదే!.... భవిష్యత్ ఎప్పుడూ ఆశాజ్యోతిలాటిది - ఆ వెలుగు అక్క ర్లేదనుకుంటే దారి ఎలా కనిపిస్తుంది? .... హృదయ ధనం ముందు ఐహిక సంపదలు తృణప్రాయమని కొత్తగా చెప్పాలా? .... ఇటువంటి వెన్నో ఆయన బోధించడమే కాదు, కటిక దారిద్ర్యంలో జీవించి ముష్కరులైన పాలకులని నిర్దాక్షిణ్యంగా విమర్శిం చాడు.... 1526 పానిపట్టు యుద్ధం లో ఇబ్రహీమ్ లోడీని ఓడించి, మొగలాయీరాజ్య స్థాపకుడయాడు బాబర్. గురునానక్ 1469లో జన్మిం చాడు. ఈ సిక్కుమత స్థాపకునికి మూడువందల సంవత్సరాల క్రితం







పంజాబ్‌ని ప్రభావితం గావించాడు విశుద్ధ మానవతావాది అయిన బాబా పరీద్'' - అని చెప్పారు పాటి యాలాకు చెందిన గురుచరణ్ సింగ్. పంజాబ్ అసోషియేషన్ కార్యదర్శి హర్ భజనసింగ్ ఆహూతులకు స్వాగతం తెలిపారు.

1989 నవంబరు 02

కావెరీ కాసెట్స్‌వారు 'అంకుశం' స్వర్ణచక్రోత్సవాన్ని (గోల్డెన్‌డిస్క్) సవేరా కాన్ఫరెన్స్ హాలులో, యమ్మెస్ రెడ్డి అధ్యక్షులుగా జరిపించారు. ప్రతిఘటన, ముత్యాలముగ్గు తర్వాత ఒక చిత్రం తాలూకు మాటల కాసెట్, యింత అధిక సంఖ్యలో అమ్మకం గావడం యిదే మొదటిసారి. నటనకు విశిష్టత, సహజత్వంలో, వొనగూడుతుందని, ముఖ్యమంత్రి పాత్ర ద్వారా యావదాంధ్రను మెప్పించిన యమ్మెస్ రెడ్డి, ఈ చిత్ర విజయానికి మూల పురుషులు. ముఖ్యమంత్రిని అపహాస్యం చేసిన చిత్రాలు వచ్చాయి గాని, ముఖ్యమంత్రి అంటే యిలా వుండాలి అనే 'పాజిటివ్ ఆర్జ్'ని కలిగించిన చిత్రం యిదొక్కటే ! ఏ కొంచెం కొత్తదనం కనిపించినా, ఏ కాస్త ఆశాకిరణం తళుక్కుమన్నా, ప్రేక్షకులు ఆదరిస్తారు, అభిమానిస్తారు. రాజశేఖర్, జీవిత ఉన్నప్పటికీ ఈ చిత్రంలోని హీరో యమ్మెస్ రెడ్డి. నిర్మాత గోపాలరెడ్డి - కోడి రామకృష్ణన్ని, శ్యాంబాబుని అభినందిస్తూ, యమ్మెస్ రెడ్డిగారి విజయం నెల్లూరు విజయమన్నారు.

. . . . . 07

"ఇందిరాగాంధీ చాలా గొప్ప వ్యక్తి - ఎంతో సమర్థురాలు. వాజ్‌పాయ్ వంటి ప్రతిపక్ష నాయకుడు ఆమెని 'దుర్గామాత'గా పేర్కొన్నారు. అయితే, ఆమె తన అధికార ప్రాబల్యం కోసం, తనది పై చేయిగా వుండటానికీ 'డెమొక్రాటిక్ ఇన్‌స్టిట్యూషన్స్'ని నీరసపరిచారు.... తనకి అనుకూలురైన ముఖ్యమంత్రులని నియమించటం ప్రారంభించారు.... చైనాతో గల సరిహద్దు సమస్యను పరిష్కరించుకొనేందుకు 1982 లో మనకి అవకాశం కలిగింది - ఆ అవకాశాన్ని ఇందిరా గాంధీ జారవిడిచారు. 1985 లో మళ్లీ ఒక అవకాశం వచ్చింది - ఈసారి రాజీవ్‌గాంధీ దానిని నిర్లక్ష్యం చేశారు .... మన రాజకీయ నాయకులందరూ తమ పార్టీకోసం శక్తి యుక్తులు ధారపోస్తున్నారేగాని ప్రజలకోసం కాదు. అన్ని పార్టీలవారూ ఇందులో దోషులే ! ఏ పార్టీకీ చెందని స్వతంత్రులు, ఋజువర్తనులు, ప్రజాహితం కోరే మేధావులు శాసన సభలలోను, లోకసభలోను ప్రవేశిస్తే తప్ప మనస్థితిగతులు చక్కబడవు" — అన్నారు ప్రెస్‌క్లబ్‌లో. సౌత్ మద్రాసు నియోజకవర్గం నుంచి పార్లమెంటుకి పోటీ చేస్తున్న వెంకటేశ్వరన్ (మాజీ విదేశాంగ కార్యదర్శి - శ్రీలంక విషయంలో భారతప్రభుత్వ విధానానికి అసమ్మతి సూచకంగా తన ఉద్యోగానికి లోగడ రాజీనామా చేశారు). 'పార్టీలెస్ డెమొక్రసీ' సాధ్యమా ?

. . . . . 10

రాణీ సీతయ్ హాలులు భమిడిపాటి రాధాకృష్ణ షష్టిపూర్తి ఉత్సవం, ఆయన రచించిన 'మనస్తత్వాలు' నాటిక ప్రదర్శనతో (రావికొండల రావు బృందం) ప్రారంభమయింది. షావుకార్ జానకి స్వాగతం తెలిపి, ముఖ్యులను వేదిక మీదకు ఆహ్వానించారు. "కోపం అన్నా రోషం అన్నా తెలుగు వారికి ఇష్టం - నవ్వడం తెలీదు, హాయిగా నవ్వలేరు. తమిళ సోదరులకు హాస్యమంటే చాలా ఇష్టం. నవ్వులు విరజిమ్ముతూ నలుగురితో కలిసిపోతారు. తెలుగువారికి నవ్వడం చేతకాదు గనకనే తమ ప్రాంతం దాటి బయటికవెళ్లలేకుండా ఉన్నారు. ఆంధ్ర కేసరి, ఆంధ్రకే - సరి అని ఒక ప్రఖ్యాత జర్నలిస్ట్ అన్నమాట కొట్టి వేయదగ్గదికాదు.... భమిడిపాటి కామేశ్వరరావుగారు తమరచనల ద్వారా తెలుగువారికి నవ్వడం నేర్పారు." - అన్నారు ముఖ్య అతిధిగా విచ్చేసిన ఆవుల సాంబశివరావు. సభాధ్యక్షులు : డివియస్ రాజు. గుమ్మడి, గొల్లపూడి మున్నగువారు ప్రసంగించారు. ఈ షష్టిపూర్తి కమిటీకి కన్వీనరులు; రమణయ్య రాజా, వివేక్ అండ్ కంపెనీ కోదండరామన్.

—యన్నార్ చందూర్








# సమీక్షలు

# చిత్రజగతి

## శక్తీ క్రియేషన్స్
## 'కలియుగ విశ్వామిత్ర'

అడయారు పార్కు హొటల్లో ఈ చిత్రం ప్రెస్‌మీట్ జరిగినప్పుడు, దర్శకులు ప్రదీప్ శక్తి, తాము తల పెట్టినది ఒక కారికేచర్ అనీ, వ్యంగ్య చిత్రమనీ అన్నారు. ఇష్టాగోష్ఠి సందర్భంగా 'గ్రేట్ డిక్టేటర్, (చార్లీచాప్లిన్) ఇనిస్పిరేషనా అని అడగ్గా, 'అదే కాదు, అలాటివి' అని మాట తప్పించారు. హిట్లర్‌ని పోలిన బార్బరుని అక్కడ పట్టుకొస్తే, యిక్కడ ముఖ్యమంత్రిని పోలిన రయిల్వే వర్కర్‌ని పట్టుకొచ్చారు. కాగా, నక్సలైట్ల చేతికి చిక్కిన త్రిలింగ దేశముఖ్యమంత్రిచేత 'బ్రదర్, బ్రదర్' అంటూ చెప్పించిన డైలాగులు రక్తి కట్టాయి వ్యంగ్యమూ హాస్యమూతో. అలాగే నకిలీ విశ్వామిత్రుడు 'మేనకా,' అంటూ వెంట పడటం, తనకు యింకా శక్తి రావాలనుకుంటూ షాక్ ట్రీట్‌మెంటుకి లోబడటం, అసలునీ, నకిలీనీ లేప్యెయడమనే బాబు ప్లాను, 'అసలు'కి గవర్నరు రక్షణ యిచ్చినప్పటికీ, రాష్ట్రపతి పాలన ఫలితంగా యిరువురూ మెంటల్ హాస్పిటల్ పాలవటం, స్క్రీన్‌ప్లే చక్కగా మలిచారు. విజయచందర్ ద్వి పాత్రలను 'భేష్' అనిపించే విధంగా పోషించాడు. రాజకీయనాయకుల మీద వేసే కార్టూనుల వంటివేనేమో ఈ వ్యంగ్య చిత్రాలుకూడా! చూస్తారు - నవ్వుకుంటారు - మర్చిపోతారు. 'నేటి మా ఊహ రేపటి నగ్నసత్యం' - అన్నారు నిర్మాతలు పిక్చర్ ప్రారంభంలో. ఊహ ఊహే - అది కాల్పనిక కపోతం. వర్తమానంలోనే ఎగురుతుంది. విశ్వామిత్ర షూటింగ్ చుట్టూ పరిభ్రమించిన ఈ చిత్రం ప్రేక్షకులని చాలాసార్లు నవ్విస్తుంది. నవ్వులు కుమ్మరించే ఈ చిత్రానికి దర్శకులు: ప్రదీప్‌శక్తి. నిర్మాత: సూర్యనారాయణబాబు .... పిఆర్ఒ: రాజు.

## శివ పార్వతీ వారి
## 'కుస్తీపట్లు'
## (GRUNT)

ఇద్దరు మనుషులు తలపడటం, కుస్తీ పట్టడం అంటే చూపరులకు

వినోదం. 'కుస్తీల నిర్వహణ' అమెరికాలో, అన్ని వినోదాలకు మల్లేనే ఒక భారి. వ్యాపారం పుట్ బాలూ, బేస్ బాలూ, క్రికెట్, హాకీల వంటివే ఈ రెజిలింగ్ మాచెస్ కూడా! టెన్నీసూ, టేబుల్ టెన్నీసూ కాస్త నాజూకైన గేమ్స్ - అయితే అన్నీ వ్యాపార సరళికి చెందినవి. మాడ్ డాగ్ జో (Mad Dog Joe) అనే రెజిలింగ్ ఛాంపియన్, ఆవేశంలో ప్రత్యర్థి మెడ విరిచేసి, హత్యా ప్రయత్న నేరానికిగాను శిక్ష పడకుండా వుండేందుకు అదృశ్యమవుతాడు. తను చేసిన తప్పుకి పరితాపం జెంది, నదిలోకి దూకి ఆత్మహత్య గావించుకున్నాడని పత్రికలు ప్రచురిస్తాయి. 'మాడ్ డాగ్ జో' విషయం ప్రజలు మర్చిపోతారు. మాస్కడ్ మార్వెల్ (Masked Marvel) అనే మరొక ఛాంపియన్ రంగప్రవేశం గావించడంతో, మొరెసొ అని జర్నలిస్టుకి మాడ్ - డాగ్ బతికివున్నాడేమోనని అనుమానం కలిగి, నెమ్మదిగా అన్వేషణ జరిపి, రహస్యం బయటికి లాగుతాడు. యలాన్ హాల్జ్ మాన్ (Alan Holzman) దర్శకత్వం. గగుర్పొడిచే కుస్తీ పట్లుతో కూడిన ఈ చిత్రం 'కాసినో'లో రిలీజయింది. పి ఆర్ ఒ: టియమ్ రామన్.

## మెట్రో ఫిలిమ్ కార్పొరేషన్ 'కొందరు అమ్మాయిలు' (SOME GIRLS DO)

కంటికింపుగా బికినీలు ధరించిన అమ్మాయిలు, పీటర్సన్ కొలువులోని సుందరాంగులు. వీరికి నాయకురాలు హెల్గా. బ్రిటన్‌లో తయారవుతున్న 'సూపర్‌సోనిక్' విమాన నిర్మాణంలో బ్రేకువేసి, తద్వారా ఒక కోటి డాలర్లు పాకెట్ చేయాలని పీటర్సన్ ప్లాను. డిటెక్టివ్ డ్రమ్మండ్, తన అమెరికన్ ఫ్రెండ్‌ఫ్లిక్కితో హాలీడేకి వెళ్దామనుకుంటూండగా, లండన్ నుంచి పిలుపు వస్తుంది. తన ఫ్లాట్ టెలిఫోను లోపల మైక్రోబాంబు అమర్చి వుండటం, డ్రమ్మండ్ ముందుగానే గ్రహిస్తాడు - కావాలని తనతో చనువు పెంచుకుంటున్న హెల్గా విషయం అనుమానాస్పదంగానే ఉంటుంది. సూపర్ సోనిక్ విమాన డిజైనర్‌ని పీటర్సన్ గరల్స్‌లో ఇద్దరు అప్పటికే పరలోకానికి పంపేశారు. వొంటిమీద బేదింగ్ డ్రస్సూ, చేతిలో స్టెన్‌గనూ వుండే ఈ అమ్మాయిలు బాస్‌కి బానిసలు; అతని శాసనం పాటించడమే వారికి పరమానందం. విద్యుద్భరిత ధ్వని తరంగాలతో ఎదుట వారిని చంపే సాధన హెల్గా చేతులలో ఉంటుంది. డ్రమ్మండూ అతని సహచరుడూ ఎంతో సమర్థవంతంగా, పీటర్సన్ ప్లాను పడగొట్టి నూతన పరిశోధనని కాపాడుతారు. కాసినోలో రిలీజైన ఈ సైన్స్ ఫిక్షన్ ఫిలిమ్‌కి దర్శకులు: రాల్ఫ్ థామస్ (Ralph Thomas) పి ఆర్ ఒ: టియమ్ రామన్.

## పూర్ణోదయావారి 'స్వరకల్పన'

'సితారా' తర్వాత, పూర్ణోదయా బేనర్‌లో వంశీ దర్శకత్వాన వెలువడ్డ

రెండవ చిత్రమిది. మ్యూజికల్ స్కోర్ తో ప్రేక్షకుల నాకట్టుకోవడం పూర్ణో దయా చిత్రాల ప్రత్యేకత మొత్తం ఆరు పాటలలో నాలుగు మధురాతి మధురంగా చెవుల మీద నిలిచి పోతాయి. (మ్యూజిక్ : అమర్) ఉన్నత సాంకేతిక ప్రమాణాలూ, రసస్ఫోరక సంభాషణలూ, సున్నితమైన హాస్యమూ గల ఈ పిక్చర్‌లో శ్రీరామ్ కథానాయ కుడు ; సీత కథానాయిక. గ్రామవైద్యు నిగా ఆ ఊరొచ్చిన హీరో, తనని చేర దీసిన వారికి (సోమయాజులు) అత్యంత ఆప్తుడై, కాబోయే అత్తగారిని (ఆమె కూతురు హైమ అయిదో ఏట తప్పిపోయింది - అందుకని తల్లికి మతి భ్రమణ) జలగండం నుంచి కాపాడి, అందరి మన్నన పొందుతాడు. వేరు సంతానం లేక, తప్పిపోయిన హైమను తలుచుకుంటూ రోజులు వెళ్లదీస్తున్న ఆ దంపతుల ఆస్తి కాజేసేందుకు, ఇంటజేరిన బావమరిది, పక్క ఊళ్లో నుంచి పంథొమ్మిదేళ్లమ్మాయిని పట్టు కొచ్చి, ఆమెకు హైమగా (సీత) తర్ఫీదు యిచ్చి రంగంలోకి దింపు తాడు. కావల్సినంత నాటకీయత సమ కూరుస్తూ, ఈ హైమ ఏకు మేకవ డంతో, యువతీయువకుల ప్రేమగాన రసమంజరి ! సీతా శ్రీరామ్‌లు ! ఒకరి కొకరు తీసిపోనంతంటి నటనా కౌశలం చూబుతారు........ నిర్మాత : ఏడిద నాగేశ్వరరావు.

# ముఖచిత్రం



'గంధపు చెక్కలలో నీ కనక ప్రభలే తోచెను - అలపించు వైదిక మంత్రా క్షరములలో - నీ విన్నాళ్ల మ్రింగు కొన్నవేదనా స్వరములే వినిపించెను'- అని వాపోయిన కవితా హృదయం, నెహ్రూ జీవితకథను కావ్యగానంగా ఇందిరాగాంధీకి అంకిత మిచ్చింది 1967 లో నాగార్జునసాగర్ తీరాన ! శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణలతో సమవుజ్జీగా, ఆలిండియా రేడియో 'కవిత్రయం' లో పాల్గొన్న నారాయణరెడ్డి 'మంటలు మానవుడు' కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ 1973లో బహుమతి నివ్వ డంలో ఆశ్చర్యంలేదు. 1977 లో 'పద్మశ్రీ' గౌరవం .... కర్పూర వసం తంలా తూర్పుపడమరలు గుబాళించా యనీ, మార్పు ఒక తీర్పుగా వికసించిందనీ తమ్ము నిమెచ్చుకున్నారు. దాశరధి... మూడువేల సినిమాపాటలు ఒకఎత్తు ; 'విశ్వంభర' ఒక్కటీ ఒక ఎత్తు. అనేక అవార్డులు అందుకున్న నారాయణరెడ్డి దేశదేశాలూ పర్యటిం చారు ; వేర్వేరు సంస్కృతీ తరంగా లను స్వయంగా చూశారు. విశ్వనాథ తర్వాత 'జ్ఞానపీఠ్' అవార్డు నారాయణ రెడ్డికి రావడం ఆంధ్రసరస్వతికే గౌరవనీరాజనం - 'చెట్టంతటి పేరొం దిన చిగురుకు ఈ సన్మానమా ?' - కాదు - 'సముద్రాలతో గీసిన - సరిహద్దులు చెరిపివేసి-మనుషులముడివేసేమాటకు'

## ఉపన్యాస భాగాలు

# రాజా - లక్ష్మి పురస్కార్



శ్రీ రాజాలక్ష్మి ఫౌండేషన్ వారికీ రమణయ్యరాజాగారికీ కృతజ్ఞతా వందనములతో ప్రారంభిస్తాను. 1979 లో ప్రారంభమైన ఈ పురస్కార ఉద్యమము పెరిగి పెద్దదయినది. పూర్వ గ్రహీతలు వయస్సులో నాకన్న చిన్నవారు. నైపుణ్యములో మిన్నలైనవారు. ఒక్క సభకు తప్ప అన్ని సన్మాన సమావేశాలకు హాజరయినాను. ఏదో ఒక పాత్ర వహిస్తూనే వచ్చాను.

పురోహితుడే పెండ్లికొడుకయితే ఎట్లా ఉంటుంది? ఆత్మీయుడైన రాజా వద్ద సన్మానము స్వీకరించడమా, సోదరునిచేత గౌరవించబడటమా అనే సంకోచం నన్ను వదలలేదు. సంకోచాల సందేహాల మధ్యే సమ్మతించాను.

నేడు ఇందిరాగాంధీ జన్మదినము. ప్రధాని నెహ్రూకన్న స్వాతంత్ర్య యోధుడైన నెహ్రూయే నాకు ఆదరణీయుడు. కొద్ది విరామములలో ఎన్ని సార్లు జైళ్లయాత్రలు. తన తండ్రి, భార్య అనారోగ్య స్థితులలో కూడ త్యాగ తీర్థ యాత్రలు ఆయనను వదలలేదు. ఎంత త్యాగదీక్ష, ఎంత దేశభక్తి; అట్టి జవహర్ శతజయంతి సంవత్సరంలో మిమ్ములను ఎన్నుకొన్నామని రమణయ్యరాజా అన్నప్పుడు ఎట్లా తిరస్కరించేది? స్నేహ సౌజన్యమునకు అదేనా నేనిచ్చే ప్రతిఫలము? స్వాతంత్ర్య సంగ్రామములో పాల్గొన్న వేలమంది స్త్రీ, పురుషులలో నాదొక స్వల్పభాగము. నేను లాఠీ దెబ్బలు తినలేదు. నా ఆస్తులు జప్తికాలేదు. ఎంతోమంది నాకన్న దేశానికి త్యాగాలు చేశారు. నా పదవీప్రమాణ స్వీకారాలలోనూ ప్రత్యేకత లేదు. వందల మంది మంత్రులయినారు. ఎందరో రాజ్యపాలకు లయ్యారు. నాహయాములో నెహ్రూ నాగార్జున సాగర్‌కు శంకుస్థాపన చేశారు. ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ అవతరణకు కృషి సల్పానని సగర్వంగానే చెప్పుకోగలను. జవహర్ ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవసభ జరిపారు. ఆ తర్వాత అలఘ్ తెలంగాణ, అలఘ్ ఆంధ్ర అని రెండు ఉద్యమాలు లేచాయి. ఉప్పెన వలెనే విజృంభించాయి. అందుకు లొంగక ఆంధ్రుల ఐక్యతను రక్షించింది ఇందిరాగాంధి. ఆమె జన్మదినాన ఇందిరమ్మకు జోహార్లు - ఆంధ్రుల ఐక్యతను కాపాడిన తల్లి.

జనహిత కార్యములలో మలచబడి, పెరిగి పెద్దవాడనైన వాడిని కాబట్టి పురస్కారములలో ఇచ్చే ద్రవ్యము నాది కాదు. ఏవ్యక్తికీ దీనిని సంక్ర

మింప చేయను. నాతొలి యౌవ్వనము లో నాకు విశాల విశ్వజనీన దృక్పథ మును ప్రసాదించిన విశ్వభారతికి ఈ పురస్కార ద్రవ్యాన్ని ఈయ సంక ల్పించినాను. ప్రస్తుతము నాకు ప్రియ తరమైన సంగీత విభాగానికే ఇస్తాను. వివరాలు విశ్వభారతి వారితో సంప్ర దించి నిర్ణయిస్తాను.

ఎన్నికలన్నప్పుడు ఎవరో ఒకరు గెలుస్తారు. ఎక్కువ మంది ఓడిపోతారు. ఏది ఏమైన ప్రజాస్వామికము చిర స్థాయిగ ఉండాలని కోరుకుంటున్నాను. భారత విధాతలము మనము. సారా జహాసే అచ్ఛా హిందుస్థాన్ హమారా అన్న మాటకు ఇదే తార్కాణము. న్యూయార్క్ నగరానికి తొలిసారిగ ఒక నల్ల మనిషి మేయరయినప్పుడు సంతోషించినాను. సిరిమావో బండారు నాయక ప్రధాన మంత్రి అయినపుడు ఎంతో సంతోషపడ్డాను. ఇందిరా గాంధి పార్టి నాయకత్వానికి వోటు చేశాను. బెనజీర్ భుట్టో విజయానికి ఇస్లాం దేశాలలో ఆమె తొలి ప్రధాని అయినందులకు హర్షించాను. సంజీ వయ్య ముఖ్యమంత్రి అయినందులకు గర్వించినాను. మహిళలకు, వెనుక నెట్టబడ్డవారికీ విజయ హారతులు పట్టా లని నా కోరికి. ఆగ్రాలో యాక్టింగ్ వైస్ ఛాన్సలర్‌గా ఒక మహిళను తొలిగా నేను నియమించాను. యుపిలో సుచేత, ఒరిస్సాలో నందిని ముఖ్య మంత్రులయినారు. ఆంధ్రలో ఎప్పుడో ? మరి యుపి ముఖ్యమంత్రి నిరాకరించిన మహిళా అధికారిని, ప్రెసిడెంటు పాలనకాలంలో, ఆరాష్ట్రం లో పెద్ద జిల్లాకు కలెక్టరుగా నియమిం చాను. ఆమె దక్షతతో బాధ్యతలు నిర్వహించింది.

ఈ గొడవంతా చెప్పడం, నేను కూడా ఒకనాడు అభ్యున్నతికై పాటు పడిన వాడినేనని తెలపడానికే 'హంఫ్ ధే ఆర్మీకాయ్‌కీ' అన్నాడు గాలీబ్ ప్రేమలో చితికి పోయిన వాని గూర్చి - వయస్సు పెరిగే కొద్దీ నా భావాలు కొత్త మిన్నులలో ఎగురు చున్నాయి. సంప్రదాయములో ఆసక్తి తక్కువ. గాంధీ బాటలో నడిచినా నెహ్రూ వైపు మొగ్గుచున్నాను.

ఇరవయ్యవ శతాబ్దంలో జన్మించి నానని గర్వించుచున్నాను. ఈ శతాబ్దపు మొదటి దశాబ్దములో జన్మిం చిన నేను చివరి దశాబ్దాన్ని కొలది వారాలలో చూడబోవుచున్నాను. దశ దశాబ్దాల పరిమళాన్ని మూర్కొన బోవుచున్నాను. దశదళపుండరీకము ఈ శతాబ్దము.

దేశములోని ఇరవైఅయిదు రాష్ట్రా లలో ఐదురాష్ట్రాలు - అరుణాచల్, మణిపూర్, నాగాలాండ్, మిజోరాం. త్రిపుర - మాత్రం నేను దర్శించలేదు. ఫిబ్రవరి మార్చి మాసాలలో వెళ్లి చూడాలని ప్రయత్నం చేస్తాను. రాజా లక్ష్మి ఫౌండేషన్ వారికీ, రమణయ్య రాజా దంపతులకు మరల కృతజ్ఞతలు. అమెరికా వెళ్లినా, వెళ్లకపోయినా ఆహ్వా నిస్తున్న సంస్థలకూ, వ్యక్తులందరికీ నా కృతజ్ఞతలు. 19-11-1989

—బెజవాడ గోపాలరెడ్డి

